## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015370

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరామ

# నీతికథావళి

(ఐదవభాగము)



మొదటికూర్పు

వేంకటపార్వతీశ్వరకవులు

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

పిఠాపురము.

1927



[వెల రు 0-5-0 లు

# విషయసూచిక



శ్రీరామ

# నీతికథావళి

(ఐదవభాగము)

## పరీక్షితుఁడు

అయోధ్యానగరమునఁ బరీక్షితుం డనునొకరాజు గలఁడు. ఆతఁడొకనాఁడు తనగుఱ్ఱము నధిరోహించి వేఁటకు బయలుదేఱెను. అరణ్యమునం దాతని కొక వింతలేడి గానం బడియెను. అంతవఱకును విచ్చలవిడిగ వనమధ్యమునఁ జరించుచు హాయిగ మేయుచున్న యాకురంగము రాజుం గాంచి నంతనే యొక్కయుదుటునఁ బరుగువాఱఁ దొడంగెను.

మహారాజుగూడఁ దనగుఱ్ఱము నతివేగముగ దాఁటించుచు నామృగమును వెంబడించెను గాని యెంతదూర మట్లు తిరిగి శ్రమపడినను హరిణమును బట్టుకొనఁజాలకపోయెను. ఆలేడి పొదలలోఁ దూరుచు, గుట్టలపై కెగయుచుఁ, గందరములలో దాఁగుచు, లోయలలోనికి దిగుచు నిట్లనేకరీతుల నాభూపాలు నలయించి చాలదూరమువఱకును దీసికొనిపోయె

ను. తుదకమ్మహారాజు గాఢాంధకారబంధుర మగు నొకకా ఱడవిలో నాయాసముతోఁ బ్రవేశింపవలసినవాఁ డయ్యెను. అప్పు డాతనికి దిక్కు తోఁచుట లేదు. ఆమృగమిఁక లభించు ననునాశగూడ లేకుండఁబోయెను. అందుచే నృపాలుఁడు మిగుల వేసటం జెంది « ఇఁక నీమృగముకొఱకుఁ బ్రయత్నించుటవలన లాభము లేదు. చాలనాయాసముగా నున్నది. ఎందైన జలము లభించునేమో వెదకి చూచి యించుక దప్పి తీర్చుకొనవలయును." అని నిశ్చయించుకొనియెను.

ఆతఁడు తృష్ణార్తిచే మిగుల నొగిలి మెల్లమెల్లఁగ గుఱ్ఱమును నడపించుకొనుచుఁ గొంతదూరముపోవునప్పటి కొకచో నాతని కొక సుందరసరోవరము గానంబడియెను. పరీక్షితుండానందముతో నాపుష్కరిణియందు స్నానముచేసి యందలి శీతలమధురజలంబులనుద్రావి మార్గాయాసము నపనయించుకొని యందలిపచ్చికను మేయుటకై తనతురంగమును వదలివైచెను.

గుఱ్ఱము మెల్లమెల్లఁగఁ దిరుగుచుఁ దామరతూండ్లను మేయుచుండెను. మహారాజాతటాకతీరమునఁ బచ్చికనేలపైఁ బరుండి బడలికఁ దీర్చుకొనుచుండెను. ఇంతలో నెచ్చటనుండియో యతిమధురంబగువీణాగానరవ మాతనిశ్రవణయుగళంబునఁ బ్రవేశించి పరమానందముం గూర్పఁదొడంగెను. అప్పుడానరనాథుండు తనలో « ఈమహారణ్యమున నేఁడిరిగినంత

వఱకు మానవసంచారమే యగపడలేదు. ఇట్టిదుర్గమవనమధ్య మునం దింతటిమనోహరముగ గానముచేయువా రెవ్వరై యుందురు ?" అని యనేకవిధముల నాలోచించుకొనియెను గాని యేమియును నిశ్చయించుకొనఁజాలకపోయెను. ఊహించినకొలఁది నాతనికి మహాశ్చర్యముగా నుండెను.

అతఁడామధురగానము నాలకించుచు నానందోన్మత్తుఁడై యేమేమియో యోచించుకొనుచుండెను. క్రమముగా నామధురస్వర మాతని సమీపించుచున్నట్లు తోఁచెను. కొలఁదిసేపటిలో నాతనికన్నులయెదుటఁ బువ్వులఁ గోసికొనుచుఁ బాడుకొనుచున్న త్రిలోకసుందరీమణి యగునొకరమణీమణి కానంబడియెను.

రాజాసుందరీరత్నముం గాంచినంతనే యున్నచోట నుండఁజాలక చటాలున లేచి యాకాంతచెంతకుం బోయి "సుందరీమణీ ! నీవెవ్వరివధూమణివి ? ఎవ్వరిదానవు ?" అని ప్రశ్నించెను.

అప్పు డాకన్యారత్నము నునుసిగ్గుచేఁ దలవంచుకొని మృదుమధురకంఠస్వరముతో "నేనెవ్వరివధూమణిని గాను. నాకింకను బెండ్లి గాలేదు" అనియెను.

రాజు.—ఆలాగా ! అట్లయినచో నీవు నన్నుఁ బెండ్లి యాడెదవా ?

కన్య—మహారాజా ! నాకొక్క కోరిక యున్నది.

ఆమనవి చెల్లించెద నని నీవు వాగ్దానము చేయఁగలిగినచో నేను నిన్నుఁ బెండ్లియాడఁగలను.

రాజ—కాంతా! నీకా సంశయ మెందులకు? నీవేమి చేయుమన్నను జేయుదును. అట్లు ప్రతిజ్ఞ చేయుచున్నాను.

కన్య—మహాప్రభూ! నేఁగోరునది చాలచిన్నకోరిక యే—జలము నాకంటికెన్నఁడు నగపడకుండునట్లు చేయవల యును. అట్లు నీయింట నన్నుంపఁగలిగినచో నేను నిన్నుఁ బెండ్లియాడఁగలను.

రాజు—వెఱ్ఱిదానా! ఇదియేనా నీకోరిక? ఇదిగో నేను ప్రతిజ్ఞాపూర్వకముగాఁ జెప్పుచున్నాను. నాభవనంబునందు నీకెన్నఁడు నుదకశబ్దశ్రవణమైనను లేకుండఁ జేయుదును.

పరీక్షితుం డిట్లాడంబడుటచే నక్కన్య యాతని బెండ్లి యాడుట కంగీకరించెను. తోడనే యయ్యెడువురకును బాణి గ్రహణ మహోత్సవము సంపన్నం బయ్యెను. మహారాజు పరమానందముతో నవ్వధూరత్నమును బల్లకియందుంచి య యోధ్యానగరమునకుఁ దీసికొనిపోయెను. నగరమునందుఁ బ్రవేశించినంతనే యానరనాథునకు విషమవిచారము గలిగెను. రాణి కెచ్చట నీళ్లగపడునోయని యాతఁ డతిజాగరూకతతోఁ గట్టుదిట్టములను గావింపఁదొడంగెను.

రాజు దృఢప్రయత్నముతో భవనసమీపమునందున్న సరోవరముల నన్నిటిని బూడ్పించివైచెను. సరయూనదివైపున

నున్నసౌధగవాక్షముల నన్నిటిని మూయించివై చెను. డాబా చుట్టును జాలనెత్తుగా గోడలను గట్టించివై చెను. అతఁడు దాసదాసీజనులం బిలిచి “మీరీదినము మొదలుకొని యంతః పురమునం దెన్నఁడును జలపానము చేయఁగూడదు” అని శాసించెను.

ఇన్ని యేర్పాటులను గావించినను రాజునకు విచారము తీఱలేదు. పరిచారకులలో నెవ్వరైనఁ బొరపాటున నెప్పుడైన జలపానము చేయుదురేమో యని సంశయించుచుండెను. దానికేమి—ఎట్లోతగినకట్టుదిట్టములు చేయవచ్చును. నిత్యము ను వారిని హెచ్చరించుచుండవచ్చును. వర్షముగురిసినచో నేమి చేయవలయును? ఆసమయమునం దామె నొకగదియం దుంచి తలుపుల నన్నిటిని బంధించివేయవలయు నని నిశ్చయించుకొనియెను. ఆరాజున కప్పటినుండి నిరంతరము నదియే యాలోచన—ప్రతినిమిషమునకు నాతఁడు తనపరిచారకులను హెచ్చరించుచుండును. నిమిషమునకు రెండుసారులు డాబా మీఁదికిఁ బోయి యేమూలనైన మేఘముక్రమ్ముకొన్నదేమో యని నలుదెసలను బరికించి వచ్చుచుండును.

నృపాలునకు నిరంతరము నదియే పనియైపోయెను. రాజకార్యములను బరిశీలించుకొనుట కాతని కవకాశ మెక్కడ నున్నది? ఇది యంతయుం గాంచి మంత్రి చాలవిరక్తుఁడై పోయెను. ప్రజలందఱును రాజదర్శనము లేక తల్లడిల్లిపోవు

చుండిరి. ఆవశ్యకకార్యములంగూర్చి యాలోచనకై మంత్రి రాజునకు వార్తనంపినప్పు డాతఁడు " నాకు తీరుబడిలేదు. నీవే యోచించి నీయిచ్చవచ్చినట్లు చేయుము" అని ప్రత్యుత్తర మంపుచుండెను.

ఈవిధముగా మాసములపై మాసములు గడచిపోవుచుండెను. ఈలోపల నెవ్వరికినిగూడ మహారాజు దర్శనమే లభించుట లేదు. రాజకార్యము లన్నియు నస్తవ్యస్తములయి పోవుచుండెను. ఇది యంతయుం గాంచి విశ్వస్తుఁడగుమంత్రి మిగులవిచారించి " కానిమ్ము! దీనికి నిష్కృతి యేదియో యాలోచింపవలయును. ఉపాయాంతరముచే రాజుహృదయమును మరలింపకున్నచోఁ గొలఁదికాలములో రాజ్యవినాశనము గాకమానదు" అని యూహించుకొనియెను.

ఒకనాఁడు మంత్రి యంతఃపురమునందలిదాసీజనమును బిలిపించి " మీరందఱు నిప్పుడు చేయుచున్నపని యేమి?" అని ప్రశ్నించెను.

అప్పుడు వారందఱును మనఃకష్టమును సూచించుచు " అయ్యా! అంతఃపురమునందొక్కనీటిచుక్కయైనను నగపడకుండునట్లు చూచుకొనుచున్నాము. ఎన్నిపను లున్నను మానివైచి ముఖ్యముగా నీవిషయము నతిజాగరూకతతోఁ జూచుకొనుచుండవలయు నని మాకు మహారాజాజ్ఞ యైనది. జల మెక్కడ నగపడిన మాప్రాణములమీఁదికి వచ్చునో యను

భయముతో మేమందఱమునుగూడ నఱచేతఁ బ్రాణము లుంచుకొని యంతఃపురకార్యములను దీర్చుకొనుచున్నారము" అని విన్నవించిరి.

రాణికి జలదర్శన మనినఁ బ్రాణసంకట మనువిషయము మంత్రికి స్పష్టముగాఁ దెలిసిపోయెను. అప్పు డాతఁడు తనలో " ఈమెకుఁ గపటతంత్రముచే నెట్లయిన జలదర్శనము గావింపవలయును. తరువాత నేమగునోచూతము ! అంతతో నీపీడ వదలిపోయినచో క్షేమమే !" అని భావించుకొనియెను.

అనంతరము మంత్రి కొలఁదికాలములోనే యొకయుద్యానవనమును గల్పించెను. అతఁ డయ్యారామమధ్యమునం దెంతవర్షము గురియుచున్నను లోపలి కగపడకుండులాగున నతినిపుణముగా నొకదివ్యభవనమును నిర్మించెను. మఱియు నా యుపవనమునం దొకచోమాత్ర మతిగూఢముగా నొక సరోవరమును నిర్మించెను. దానిచుట్టు నెత్తుగ గోడలను గట్టించెను. వృక్షశాఖలు, పుష్పలతలు మొదలగువానినడుమ నా పుష్కరిణి యున్నట్లు ప్రయత్నించిచూచువఱకు నెవ్వరికిని గానరానివిధంబునఁ గల్పింపఁబడియెను. కొంతకాల మాయుద్యానవనంబునఁ దిరిగినవారుగాని యచ్చట నాసరోవరమున్నదని గ్రహింపఁజాలరు.

అత్యద్భుతంబును, నతిమనోహరంబును, నసాధారణంబు నగునుద్యానవనమందిరము మంత్రిచేఁ గల్పింపఁబడి

నట్లు క్రమముగా మహారాజునకుఁ దెలియవచ్చెను. ఆదివ్య మందిరమం దున్నచో నెంతవాన గురియుచున్నను నగపడదని కూడ నాతఁడు తెలిసికొనియెను. ఈయింటనుండి నిమిషనిమిషమునకు వానయెప్పుడు వచ్చునో భయముచే నాకసమువంక నిరంతరమును జూచుచుండుట మహారాజునకు మహాకష్టముగా నుండెను. మంత్రియుద్యానమందిరముమాట తెలిసినంతనే మహారాజున కించుక యూపిరి తిరిగినట్లయ్యెను. ఆమందిరము నొక్కసారి చూడవలయునని యాతనికిఁ గుతూహలము గలిగెను.

ఒకనాఁడు రాజు స్వయముగఁబోయి యాభవనమును, ఉపవనమును జూచి మిగుల నానందించెను. తాను రాణితోఁ గలసి సిరహాయముగ నివసించియుండుట కాసౌధము మిగుల ననుకూలముగా నుండు నని సంతోషించెను. తఱచుగా వాన కొఱకు భయపడి యాకసమువంకఁ దలయెత్తి చూడవలసిన కష్ట మిఁకఁ దప్పిపోవు నని యూహించెను. రాణితోఁ గూడ నాయుద్యానమందిరమునఁ బ్రవేశించుటకు రాజిఁక నొకదినమైన నాలస్యము చేయలేదు. మంత్రిమనసులో నానందమును బట్టఁజాలకపోయెను. ఆతఁడు స్వయముగా రాజదంపతుల నామందిరమునఁ బ్రవేశపెట్టి వెలుపలఁ దాళమును వైచి వచ్చెను.

ఇన్నాళ్ళనుండియుఁ దలుపులు మూసినగదిలో నూపిరి

లెఱుగకుండ నిర్బంధముగా నున్న రాణి యిప్పు డాయుద్యానభవనమునఁ బ్రవేశించి పరమానందముతో విచ్చలవిడిగ విహరింప నారంభించెను. ప్రాతఃకాలముననే రాజును రాణియు లేచి యుద్యానమంతయుఁ దిరిగి చూచిరావలయు నని బయలుదేరిరి. క్రమముగా రెండు జాములు తిరిగిపోయెను. వనవిహారానందముచే నొడలెఱుంగక తిరుగుచున్న వారి కింటిమాటయే జ్ఞప్తికి రాదయ్యెను.

రాణితోఁ గలసి వచ్చినదిమొద లిప్పటివఱకును రాజొక గ్రుక్కెడునీరైనను ద్రాగి యుండలేదు. అప్పుడు రెండుజాములుతిరిగిపోవుటచే నెండ మిక్కిలి తీవ్రముగాఁ గాయుచుండెను. అందుచే నాతనికి దాహమధికమై నోరెండుకొనిపోవఁదొడఁగెను. ఇఁక నాతఁ డాయెండలోఁ దిరుగఁ జాలక క్రమముగాఁ జెట్లక్రిందికిఁ బోయి విశ్రమింప నారంభించెను. అటనుండి యాతఁడు లతానికుంజములలోఁ బ్రవేశించెను. మఱియుఁ జలువకొఱకాసించి యమ్మహారాజొక పువ్వుపొదనుండి మఱియొకపొదలోఁ బ్రవేశించుచు సేద దీర్చుకొనుచుండెను. ఇట్లుండఁగా నాతని కొకలతానికుంజాంతరాళంబునం దాకస్మికముగా నొకచిన్న సరోవరము కంటఁ బడియెను !

తృష్ణాభరముచే సకలాంగకములును దహించుకొనిపోవుచుండ నోట మాట రాక, యొడలు దెలియక యెంతయో తల్లడిల్లుచున్న రాజప్పు డాజలాశయముం గాంచి ప్రాణములు

లేచివచ్చినట్లుగా సంతోషించెను. ఆతని కష్టము జలసందర్శ
నమువలనఁ గొంప మునిఁగిపోవు ననుమాటయే స్మృతియందు
లేకపోయెను. అందుచే నాతఁడు పరమానందము నందుచు
రాణిని వెంటఁబెట్టుకొని వచ్చెను. పిమ్మట నయ్యిరువురును
గలసి యాసరోవరమునఁ బ్రవేశించి పరమాహ్లాదముతో జల
విహారముం గావింప నారంభించిరి.

స్నాన మైనది. మహారాజునకు దాహము తీరినది.
ఆతనిహృదయమును, శరీరమునుగూడ శీతల మయ్యెను. రాజు
తీరమునకు వచ్చి చూచెను. రాణి యెచ్చట నున్నది? ఎం
దును గానంబడుటలేదు. ఇరువురును గలసి సరసిలో మునుఁ
గుటయే గాని మరల రాణి తేలి స్నానముచేసినజాడ యేమియు
రాజున కగపడలేదు.

అప్పు డాకస్మికముగా రాజుతలపై నాకసము విఱిగిప
డిన ట్లయ్యెను. ఆతఁడు దుఃఖగద్గదస్వరముతోఁ బరిచారకులం
బిలిచి యెల్లసంగతులను వారి కెఱింగించెను. నిమిషములో
నీవార్త నగరమంతటను వ్యాపించెను. అనేకులుగుంపులుగుం
పులై యావనమందిరమునఁ బ్రవేశించిరి. ఆసరోవరమంత
యును గాలించి వెదకిరిగాని రాణిజాడ యెంతమాత్రము నగ
పడలేదు.

ఆపుష్కరిణియందలి జలమంతయును దోడివైచిరి. కాని
యేమియు లాభము లేకపోయెను. ఆసరోవరమధ్యమునం దొక

వివర మగపడియెను. అందు కప్పలు నివసించి యుండెను. దానిం గాంచినంతనే రాజు మహాక్రోధముతో " ఈదుష్టమం డుకములే నాప్రియురాలిని మ్రింగివైచినవి. సేవకులారా! మీరందఱును గలసి వీని నీక్షణమునందే చంపుఁడు! ఎవ్వారె న్నికప్పలను జంపుదురో వారి కంతయధికముగా బహుమాన మిచ్చెదను " అని యాజ్ఞాపించెను.

రాజుతలఁచినచో దెబ్బలకుఁ గొదవ యేమున్నది! ఆమాట విన్నంతనే చిన్నలును, పెద్దలును గుంపులుగుంపు లుగఁ జేరి తమచేతికఱ్ఱలతోఁ గప్పలను గొట్ట నారంభించిరి. వారీవిధముగా విజృంభించి నీటివంచలను, వనాంతరములను, గృహకోణములను నిలిచియున్న కప్పలనన్నిటిని బెదరించి తోలి సంహరించుచుండిరి. కఱ్ఱలను జేతఁబూని కప్పలను గొట్టుటకై వచ్చుచున్నజనసమూహముచే నావనమందిర మంతయు నిండి పోయెను.

కప్పలను గొట్టితెచ్చి బహుమానముల నందుకొను చుండు విజయశూరులచే రాజసభారంగ మంతయు సంకుల లముగా నుండెను. రాజోద్యోగులందఱు నీవిషయముంగూర్చి నవ్వుకొనఁదొడంగిరి. మంత్రి యిది యంతయుం గాంచి విచా రించుచుండెను.

ఇఁక దిక్కుమాలినకప్పలదుఃఖమును దీర్చువా రెవ్వరు? అవి నీటిలో మునికినచో వలలువైచి పట్టుకొనుచుండిరి. బయ

టికి వచ్చినచో బండలతో మోదుచుండిరి. పొదలలో దాగినచో వెదకివెదకి చంపుచుండిరి. నరియలలో దూరిన బెల్లగించి వధించుచుండిరి. ప్రాణభయముచేఁ గప్పలన్నియు గడగడలాడిపోవుచుండెను. తుదకాయల్పజీవులన్నియును జేరి యొక్కసారిగా మహారాజుచెంతకుం బోయి యేకకంఠముతో "మహారాజా! దిక్కుమాలిన క్షుద్రజీవుల మగుమమ్ము రక్షింపుము. మీయాజ్ఞచే సేవకులందఱును మమ్ము నిశ్శేషముగా నాశనము చేయఁజూచుచున్నారు. రక్షింపుము! రక్షింపుము" అని వేఁడుకొనియెను.

అప్పుడు మండూకరాజు తపసివేషముం దాల్చి మహారాజు చెంతకుఁ బోయి వినయవినమితుండై దీనస్వరముతో "మహాప్రభూ! ఈభేకంబులు నీయెడలం గావించిన యపరాధం బేమియును లేదు. సర్వభూతదయాపరు లగుమీరు వానియెడల వృథాక్రోధమును వహించుట ధర్మము గాదు" అని విన్నవించెను.

రాజామాట లాలకించి కోపముతో "అట్లెన్నఁటికిని విడుచువాఁడను గాను. నిశ్చయముగా నీదుష్టభేకములే నారాణిని మ్రింగివైచినవి. వీనిని నిర్మూలముగఁ జేయకుండ విడువను!" అనియెను.

మండూకరాజు మరల మృదుస్వరముతో "మహారాజా! నీరాణిని మండూకములు భక్షించియుండలేదని నిశ్చయముగాఁ

జెప్పుచున్నాను. నేను మండూకప్రభుండను. నా పే రాయువం దురు. నీరాణి యగుసుశోభన నాతనూజ—ఆమె యిప్పుడు నా చెంతనే యున్నది ” అని చెప్పెను.

మహారాజామాట విన్నంతనే లజ్జితుండై తలవంచుకొ నియెను. నీచవంశసంభవ యగుమండూకాంగన తనకు రాణి యయ్యె ననుకొనుట యాతని కెంతయో చిన్నతనముగా నుం డెను. దూరదృష్టి యెఱుంగక రూపమోహముచేఁ దానొన రించిన యకార్యమునకుఁ దగినశాస్తి యయ్యెనని యాతనికిఁ బరితాపము గలిగెను. కామాంధకారముచేఁ గన్నుఁగానక యెన్నియోకష్టములను సుఖముగా ననుభవించిన తనయవివేక మున కాతఁ డనేకవిధముల నిందించుకొనఁదొడంగెను.

అప్పు డుచితజ్ఞుం డగుమంత్రి మహారాజును సందర్శించి స్వప్నసదృశముగా జరగిపోయినవిషయముం గూర్చి మరల స్మృతికిఁ దెచ్చుకొనవలదని బోధించి ప్రభుని బ్రసన్నుం గావిం చెను.

---

ప్రబలమోహాంధకారని◆మగ్నచిత్తు
లై మహాప్రాజ్ఞులుంగూడ ◆ నజ్ఞులగుచు
మంచిచెడ్డ లెఱుంగక ◆ సంచరించి
యంతమందుఁ బశ్చాత్తప్తు◆లగుచునుందు.

# ఇంద్రద్యుమ్నుఁడు

ప్రళయకాలంబులయందునుగూడఁ జలింపక ప్రాణము లతో నిలిచియుండువాఁడు మార్కండేయుఁడు. ఆతఁ డెన్ని యోప్రళయములను దనకన్నులారఁ గాంచి యుండెను. ఆతఁడు చాలఁ బురాతనుఁడు. ఆతనికంటెను జాల పురాతనపురుషుఁ డైనవాఁడు ఇంద్రద్యుమ్నుఁడు. ఆమహారాజు చేసినదానము లకును, ధర్మకార్యములకును, యజ్ఞములకును లెక్కలేదు. ఆత డెంతటిపుణ్యమును సంపాదించెనో దానిపరిమాణమును నిర్ణ యించి చెప్పుట యసాధ్యము.

ఆమహీపాలుఁడు తనపుణ్యబలముచే స్వర్గలోకమున కుం బోయి యందు బహుసహస్రవర్షంబులు సుఖోపభోగంబు లననుభవించెను. అట్లు చిరకాలంబు గడచుటయు జగంబునం దాతనికీర్తి లోపించిపోయెను. అందుచే నాతఁడు స్వర్గమునుండి మరల భూతలగతుండు గావలసివచ్చెను.

ఆరాజట్లు స్వర్గచ్యుతుండై మర్త్యలోకంబునఁ బ్రవే శించునప్పటి కాతని చరిత్రమే భూలోకమున విస్మృతమైపో యెను. ఆతనిదానధర్మములు యజ్ఞములు మొదలగువానిగౌర వముమాట యటుండఁగా నామహీపాలునిపేరుగూడ నెఱింగి నవారెవ్వరును జగంబున లేకుండఁబోయిరి.

అప్పు డింద్రద్యుమ్నుండు తనలో "మార్కండేయ మునీంద్రుఁడు చాలకాలముక్రిందటివాఁడు. మృత్యుంజయుఁ డగుటచే నాతఁ డింకను జీవించి యుండును. ఒకవేళ నాతనికి నాసంగతి తెలిసినఁ దెలిసియుండ వచ్చును. ఒకసారి యాతని కడకుఁ బోయి యడిగెదను." అని భావించుకొనియెను.

తోడనే యాభూనాథుఁడు మార్కండేయాశ్రమమునకుఁ బోయి యమ్మునీంద్రుని సందర్శించి "మహాత్మా! నేనింద్రద్యుమ్నుండనువాఁడను. చాలకాలముక్రిందట నీభూలోకమున రాజ్యపరిపాలనముం గావించితిని. ఇప్పు డీలోకములోనివారం దఱును నాచరిత్రమునే మఱచిపోయిరి. మీ రేమైన నన్నెఱుం గుదురేని దయయుంచి యానతీయవలయును" అని ప్రార్థించెను.

మార్కండేయుం డాతనిమాట లాలించి యాశ్చర్యముతో "అయ్యా! నేనెప్పుడును దీర్థక్షేత్రములవెంటఁ బడి తిరుగుచుందును. అస్తిమితుండ నగునే నెన్నియోసారులు నాసంగతినే మఱచిపోవుచుందును. అట్టివాఁడను, నీచరిత్రము నెట్లు జ్ఞప్తియం దుంచుకొనఁగలుగుదును?" అని చెప్పెను.

ఇంద్రద్యుమ్నుం డమ్మునిచంద్రుని వచనంబు లాలకించి ఖిన్నుండై "సంయమీంద్రా! మీకంటెను బురాతనులైనవారెవ్వరైన నిప్పు డీభూలోకమునందున్నచో నెఱింగింప వలయును" అని ప్రార్థించెను.

మార్కండేయుం డించుకసే పాలోచించి "రాజా

హిమాలయపర్వతమునం దొకపక్షి యున్నది. అది నాకం టెను జాల పురాతనమైనది. నీవక్కడకుఁ బోయి తెలిసికొనఁ దలంచితివేని నేనును నీవెంట వచ్చెదను. కాని యది చాల దూరదేశము !" అని చెప్పెను.

ఇంద్రద్యుమ్నుం డామాటకుఁ బరమసంతుష్టుండై «మునీంద్రా! ఎంతదూరమైన నేమి? పెద్దలగుమీరు శ్రమపడి నడవనక్కఱలేదు. నేను మిమ్ములను నాభుజముపైఁగూర్చుండఁబెట్టుకొని యచ్చటికిఁ దీసికొనిపోయెదను. దయయుంచి నాతో రావలయును" అని వేఁడుకొనియెను.

మునివరుం డగుమార్కండేయుం డందులకు సమ్మతించెను. ఇంద్రద్యుమ్నుం డాతని నెత్తుకొని యాశ్రమంబున హిమాచలముంజేరి యాపక్షిని సందర్శించి «పక్షీంద్రా! ఈలోకంబున నీకంటెఁ బెద్దవా రెవ్వరును లేరని విని యుంటిని. నీవింద్రద్యుమ్నుండ నగునన్నెఱుంగుదువా?" అని ప్రశ్నించెను.

ఆమాట విని యావృద్ధవిహంగము తనకను ఱెప్పలను విప్పి, గోళములవంటి గ్రుడ్లు మిలమిల మెఱయుచుండ ముందటికి వచ్చి కూర్చుండి మరల లేచి, యించుకవంగి, ప్రక్కకుఁ దిరిగి యారాజు నెగాదిగఁ బరిశీలించి యేకాగ్రచిత్తముతోఁ దలపై కెత్తి యాలోచించి తుదకు గంభీరస్వరముతో «మహారాజా! నాకు నిన్నుఁజూచినట్లు స్మృతి గలుగుటలేదు." అని చెప్పెను.

రాజంతటితో నూరకుండక "విహంగరాజా! నీకంటెను ముసలివా రెవ్వరైన నున్నారా?" అని ప్రశ్నించెను. అప్పు డాపక్షి యించుక యోచించి "అయ్యా! ఇచ్చటికిఁ జాల దూరంబున నింద్రద్యుమ్న మనునొకసరోవర మున్నది. దాని తీరమునందు నాడీజంఘుఁ డను పేరితో నొకబకశ్రేష్ఠుఁడు విహరించుచుండును. మీ రాతనియొద్దకుఁ బోయి తెలిసికొన్నచో సర్వంబును దెలియఁగల దనుకొనియెదను. అతఁడు నాకంటెఁ జాలపెద్దవాఁడు" అని యెఱింగించెను.

ఆపక్షి చెప్పినమార్గమును బట్టి యింద్రద్యుమ్నుండు మార్కండేయసహితముగాఁ బోయి యాసరోవరమును జేరి తీరమునందున్న బకరాజమును సందర్శించెను. అప్పుడు మార్కండేయుఁ డాకొంగం గాంచి "అయ్యా! నీవింద్రద్యుమ్న మహారాజు నెఱుంగుదువా?" అని యడిగెను.

అప్పు డతివృద్ధుం డగునాడీజంఘుఁ డొంటికాలిపై నిలిచి దీర్ఘకాలమువఱకు నాలోచించి "మహాత్మా! నాకాతని చరిత్ర మేమియును దెలియదు. ఇంతకాలమునుండి జీవించి యుంటిని గాని నేనెన్నఁడు నాతనిపేరైనను వినియుండలేదు" అని చెప్పెను. ఇంద్రద్యుమ్నుఁ డాతనిం గాంచి "నీకంటెను ముసలివా రెవ్వరైన నిప్పు డీలోకంబున జీవించియున్నారా?" అని యడుగుటయు నాడీజంఘుండు తత్క్షణమే "అయ్యో! లేకేమి? ఈసరోవరమునందే అకూపారుం డనునొకవృద్ధకచ్ఛ

పుడున్నాఁడు. ఆతఁడు నాకంటెను జాలవృద్ధుఁడు!" అని చెప్పెను.

రాజాతని నొకసారి దర్శింపవలయు నని వాంఛించుటయు నాడీజంఘుఁడు "మంచిది. నేనాతని బిలిచెద" నని చెప్పి యాసరోవరకోణముకడకు వారిని దీసికొని పోయి యుచ్చస్వరముతో "అకూపారా!" అని పిలిచెను. ఆనాడీజంఘుని కంఠస్వరము నాలకించినంతనే కూర్మరాజతిశీఘ్రముగ జలమధ్యమునుండి వెలుపలికి వచ్చి "ఏమినాయనా!" అని పలుకరించెను.

అప్పుడు మార్కండేయుం డాముసలితాఁబేటిం గాంచి "అయ్యా! నీవీయింద్రద్యుమ్నమహీనాథు నెఱుంగుదువా?" అని ప్రశ్నించెను. ఆమాట విన్నంతనే కూర్మరాజు గొలుగొలున నేడువ నారంభించెను. కొంతసేపటి కాతఁడే దుఃఖము నుపశమించుకొని "అయ్యా! ఆమహారాజు నెఱుంగనివా రెవ్వరుందురు? ఈజగంబున్నంతకాలము నాతనిచరిత్రము కీర్తింపఁబడుచు నుండవలసినదే. ఆతఁడు చేసినన్ని మహాయజ్ఞముల నెవ్వరు చేసినారు? ఆపుణ్యాత్ముఁ డొనరించిన గోదానములకు లెక్కయున్నదా? యజ్ఞములలో నాతఁడు దానముచేసిన గోవుల కాళ్ళదెబ్బలచేతనే యీభూతలమంతయును బల్లమై యాతనిదానజలధారలిందుఁ బ్రవేశించినవి. అప్పటినుండియు నీసరోవర మింద్రద్యుమ్ననామముచేఁ బ్రసిద్ధంబై యున్న

ఆనాఁటినుండియు నేనిందుఁ బ్రవేశించి సుఖంబుగఁ గాలక్షేపము చేయుచున్నాను." అని చెప్పెను.

అంతలోనే స్వర్గలోకమునుండి దివ్యవిమాన మచ్చటికి విచ్చేసెను. దేవత లంతరిక్షమున నిలిచి యింద్రద్యుమ్ను నుద్దేశించి "మహారాజా! ఇంకను నీపుణ్యచరిత్రము భూలోకమునందు విస్మృతమై పోలేదు. నీవు మరల నీవిమానము నధిరోహించి స్వర్గమునకు విచ్చేయుము!" అని హెచ్చరించిరి.



పుణ్యచారిత్ర మెందాఁకఁ • బుడమినుండు
నిలుచు నందాఁక స్వర్గంబు • గలదుగానఁ
బరసుఖార్థులు చిరకీర్తి•కరములైన
పుణ్యకార్యంబు లొనరించి • పోవుచుంద్రు.

# కృతజ్ఞత

పూర్వకాలంబున నొకకిరాతుఁడు ఘోరవిషలిప్తంబు లగుబాణములతో మృగంబులను వేఁటాడి చంపి వానిమాంసముచేఁ గుటుంబపోషణము చేసికొనుచుండెను. ఒకనాఁ డాతనియలుగు గుఱితప్పి యొక మహావృక్షమునకుఁ దగులుకొనియెను. ఆశరాగ్రమునందలి విష మెంతటిదారుణమైనదియో గాని యతివిశాలం బగు నాపురాతనభూరుహము తత్క్షణమందే యగ్నిజ్వాలావృతమై నిమిషములో మాడిపోయెను.

యుగయుగాంతరములనుండి దానిశాఖలపై గూండ్లు కట్టుకొని తరతరములనుండి నివసించుచున్నపక్షులన్నియు నయ్యాపద్భవంబునకు భీతిల్లి చిరాశ్రయస్థానమగు నా తరువరమును బరిత్యజించి చెట్టొకపిట్టగాఁ జెల్లాచెదరై పోయెను.

ఆవృక్షస్కంధమునందలి యొకతొఱ్ఱలోఁ జాలకాలమునుండి యొకచిలుక నివసించి యుండెను. ఆవృక్షరాజము కాలవశంబున నావిధముగా శుష్కించిపోవుటం గాంచి యాశుకము చాలవిచారించెను. ఇతరములగు తనతోడి విహగంబులన్నియు జీర్ణంబగు నాభూజమును ద్యజించిపోవుచుండుటం గాంచియు నాకీరరాజ మెంతమాత్రమును దానిని బరిత్యజించి పోఁజాలకపోయెను. ఎంతశుష్కించిపోయినను, ఎంతనిష్ఫలం

పై పోయినను, ఆవృక్షమునకును, దనకును గలచిరకాలసంబంధమును విశ్వాసము గలయాచిలుక కేవలమును ద్రెంచి వైచుకొనఁజాలకపోయెను. ఆయుత్తమవిహంగము నిద్రాహారములనుబరిగణింపక నిరంతరము నామహీజముంగూర్చియే దుఃఖించుచుండెను.

అమరేశ్వరుం డగునింద్రుండు స్వర్గమునుండి యాచిలుక యద్భుతచరిత్రముం గాంచి మిగుల నానందించి యాపక్షీంద్రున కొకసారి తనదర్శనభాగ్యమును బ్రసాదింపకుండ నిలువఁజాలకపోయెను. ఒకనాఁ డాచిలుక యాతరుకోటరంబునఁ గూర్చుండి దానిపూర్వసౌభాగ్యముం దలంచుకొని దుఃఖించుచుండఁగా దేవేంద్రుం డొకవృద్ధబ్రాహ్మణవేషధారియై యచ్చటికి వచ్చి “ ఓపక్షిరాజా ! నీతల్లి మహాసౌభాగ్యముచే నీవంటితనయునిం బడసి ధన్యురాలైనది. కాని నీవీ యెండుచెట్టు నేల యాశ్రయించి యుండెదవు ? ఈసమీపమునందెన్నియో ఫలవృక్షము లున్నవి. ఇందు నీకొక కసుగాయయైనను లభింపదుగదా ! శూన్యగేహమువలె నున్న యీశుష్కభూజమును విడిచి యెచ్చటికైనను బోఁగూడదా ?” అనియెను.

ఆచిలుక చాల తెలివి గలది. చూచినంతనే యెదుటివారిమంచిచెడ్డలను బాగుగఁ దెలిసికొనఁగలదు. ఆమహీసురుఁడు చాల గొప్పవాఁడని యాకీర మింతలోనే గ్రహించి

“ మహాత్మా! మీవంటి పుణ్యపురుషులయొంతిని జవదాటుట నావంటిదానికి సాధ్యమగునా ? కాని నేను పుట్టినప్పటి నుండియు నీచెట్టునే యాశ్రయించియుండి క్రమముగా బెరిగి పెద్దవాడనైతిని. ఈమహీరుహము తండ్రివలె మాకుటుంబమునకు నిలువనీడ నొసంగి యెన్నియో కష్టసమయములయందు మమ్ము గాపాడినది. మహావైభవముతో నలరారుచు మాకప్పుడంతటిమహోపకారముం గావించిన యీవృక్షరాజము సిట్టియాపత్సమయమునందు విడనాడిపోవుటకు నా హృదయ మెంతమాత్రము నంగీకరింపకున్నది. అట్లు పరిత్యజించిపోవుట యధర్మమగునో కాదో మీరే వచింపుడు!” అనియెను.

సాధుజనసమ్మతంబు లగు చిలుకపలుకుల నాలకించి దేవేంద్రుండు సంతుష్టుండై “ ఓశుకశ్రేష్ఠా! నేను నీయుత్తమ స్వభావముం గాంచి పరమానందభరితుడ నైతిని. నేను దేవేంద్రుడను. నీకేమికావలయునో కోరుకొను మిచ్చెదను” అని యనుగ్రహించెను.

అప్పుడాకీరరాజము పరమసంతోషముతో నతిమృదుల స్వరంబున “ సురలోకనాథా! నీకు నాయెడల దయ గలదేని నాకాశ్రయదాత యగు నీవృక్షరాజ మెప్పటివలె జీవించి శాఖాపల్లవపత్రప్రసూనఫలభరితంబై మహావైభవంబున విలసిల్లునట్లనుగ్రహింపుము ” అని వేడుకొనియెను.

ఇంద్రుండు మహోల్లాసముతో “నట్లే యగుఁగాక” యని పలుకుచు శుష్కభూజముపై నమృతరసమును జిలుకరించుటయుఁ దత్క్షణమందే యమ్మహీరుహము యథాపూర్వముగ విభవశోభితం బయ్యెను.



కష్టసుఖములలోన భాగంబు గొనుచు
నాపదలనైన, సంపదలందు నైనఁ
బాయ కాశ్రయులకు మేలు సేయుకొఱకె
చూచుచుందురి కృతజ్ఞులౌ సుజను లెపుడు.



# ఆర్త రక్షణము



శిబివంశమున కలంకారభూతుఁడైన "ఉశీనరుఁడు" అనురాజేంద్రునిచరిత్ర మతిపవిత్రమైనది. ఈలోకమునందుఁ బుణ్యాత్ముల యుత్తమచరిత్రములు గౌరవింపఁబడుచున్నంత కాలమునుగూడ నుదారహృదయుఁ డగునుశీనరుఁడు కీర్తింపఁ బడుచునే యుండును.

మహారాజగు నయ్యుశీనరుఁడు గావించినన్ని యజ్ఞముల భూలోకమునందే గాక దేవలోకమున దేవేంద్రుఁడుగూడఁ గావించి యుండలేదు.

ఒకనాఁ డింద్రుండు వైశ్వానరునిం బిలిచి "ఓయగ్ని దేవా! మనమొకసారి భూలోకమునకుఁ బోయి యుశీనరుఁ డెంతటి ధార్మికుఁడో పరీక్షించి రావలయును. అతనిచరిత్రము నుగూర్చి యనేకు లనేకవిధములుగాఁ బ్రశంసించుచుండుట వినియున్నాఁడను. స్వయముగాఁ జూచినఁ గాని సత్యము బోధపడదుగదా! మనము తప్పక పోయివత్తము రమ్ము!" అనియెను.

అట్లయ్యిరువురు నాలోచించుకొని యింద్రుఁడు డేగరూపమును, హుతాశనుఁడు పావురపురూపమును దాల్చి భూలోక యాత్రకు బయలుదేఱిరి.

అప్పుడు మహారాజగునుశీనరుఁడు మహావైభవముతో యజ్ఞమును గావించుచుండెను. అప్పు డాకాశమార్గమున శ్యేనముచేఁ దఱుమఁబడుచుఁ బ్రాణభయంబున గడగడవడంకుచు నొక్కయుదుటునఁ గ్రిందికి దిగి పావుర మమ్మహారాజు తొడపై వ్రాలి యుత్తరీయముచాటున దాగికొనియుఁ గంపించిపోవుచుండెను.

దానివెంటనే డేగయుఁ గ్రిందికి వ్రాలి యాభూపాలునిచెంత నిలిచి “స్వామీ! నాకడుపు మండిపోవుచున్నది. ఈయాకలిబాధచే నాప్రాణములు నిలుచునట్లులేదు. నీవీకపోతమును విడిచిపెట్టుము. నేను దానిని భక్షించి ప్రాణములను నిలుపుకొందును” అని వేఁడుకొనియెను.

రాజు—దీనిని నేనెట్లు విడువఁగలుగుదును? ఈకపోతము ప్రాణభీతిచేఁ బరుగెత్తుకొని నాచెంతకు వచ్చి నన్నాశ్రియించినది. ఇట్టిదీని నూరక పరిత్యజించివైచుట ధర్మము గాదు. శరణాగతపరిత్యాగము బ్రహ్మహత్యకంటెను, గోహత్యకంటెను మహాపాతకము గాదా?

డేగ—మహాప్రభూ! అఖిలజీవులు నన్నమువలననే జీవించుచున్నవి. కావున నేనిప్పు డాహారమును భుజింపకయున్నచోఁ గొలఁదినిమిషములలోఁ జచ్చిపోవుదును. నేను మృతుండనైనచో నాభార్యయు, నోరెఱుంగనిబిడ్డలును, దిక్కుమాలిన నాయాశ్రితులునుగూడ మరణింపఁగలరు. ఒక్కజీవిని రక్షిం

షదలంచి యింద్రియజీవులను నిష్కారణముగా వినాశమును గల్పించుట మీవంటివారి కుచిత ధర్మమగునా ?

రాజు—నాకట్టి యుద్దేశము లేదు. మీరందఱు నేల చావవలయును. మీకాహారమే గదా కావలయును ? మీభో జనముకొఱకు కీకపోతమునే చంపనక్కఱలేదు. ఇక్కపోతమాం సముకంటెను రుచ్యంబు లగుననేకమాంసములను దెప్పించి మీకుం బెట్టించెదను. హాయిగ భుజించి మీయాఁకలి దీర్చు కొని జీవింపుఁడు.

డేగ—రాజేంద్రా ! పరమేశ్వరుఁడు పావురమునే డేగ కాహారముగా నేర్పఱిచియున్నాఁడు. మాజాతివారితరజీవుల మాంసములను భుజించువారు గాదు. కావున నాలక్ష్యము నకుం జిక్కితప్పించుకొని నీచెంత దాఁగియున్న యీపావురమును నాకొసంగి సకుటుంబముగ నన్నుద్ధరింపఁగోరెదను.

రాజు—ఓవిహంగవర్యా ! నీవిప్పుడు విశాలంబగు నారాజ్యమును వాంఛించినను నేను మనఃపూర్వకముగా నిచ్చి వేయఁగలను. ఇంకను నేను కోరినను ప్రాణపణంబుగ సంపా దించి తెచ్చి యర్పింపఁగలను. కాని శరణాగతం బగునీక్కపో తమ్మునుమాత్రము నీకొఱకుం బరిత్యజింపఁజాలను. నేనేమి గావించిన నీవిక్కపోతమును విడుచుటకు సమ్మతింతువో యెఱిం గింపుము. నేనిప్పుడు నీకోరినకోరికం దీర్చుటకు సంసిద్ధుఁడనై యున్నాఁడను.

డేగ యతివిచారసూచకముగా నొక్కనిట్టూర్పు విడిచి మొగమించుక ప్రక్కకు వంచి కన్నులు మూసి కొంతసే పాలోచించి మృదుస్వరముతో « భూపాలచంద్రా ! మీకీపావురము నం దంతటి ప్రేమయే యున్నచో నిది యెంతమెత్తుండునో యంతటి తూకముగలమాంసమును మీశరీరమునుండి కోసి నాకొసంగవలయును. అట్లయినచో నేను దానిం గైకొని పరమసంతోషముతో నీపావురమును విడిచిపెట్టి పోఁగలను ” అని చెప్పెను.

ఆమాటకు మహారాజు పరమానందభరితుఁ డయ్యెను. తత్క్షణమే యాతఁ డొకత్రాసును దెప్పించి యందొకవైపునఁ బావురమునుంచి రెండవైపునఁ దనదేహమునుండి మాంసమును గోసి వైచుచుఁ దూఁప నారంభించెను. ఈవిధముగా రాజు తనమాంసమంతయుఁ గోసి వైచినను గపోతముతో సమముగాఁ దూఁగకయేపోయెను. తుదకమ్మహారాజు నిరుపాయుండై యస్థిమాత్రం బగుతనశరీరమునంతను దులయందుంచివైచెను.

ఆసాహసకృత్యముం గాంచుచున్నసభాసదు లందఱును శోకభయకంపితులై నిశ్చేష్టులైపోయిరి. అప్పు డా శ్యేనకపోతము లింద్రాగ్నిరూపములం దాల్చి పరమానందగద్గదకంఠస్వరములతో « మహారాజా ! మేమింద్రాగ్నులము. నీధర్మదీక్షను బరీక్షింపఁదలఁచి యీవిధముగాఁ గపటవేషములం దాల్చి వచ్చితిమి. అత్యద్భుతంబును, అసాధారణంబును నగు

నీయిప్పటిసాహసకృత్యము త్రిభువనప్రశంసనీయమైనది. ధర్మైకతత్పరుండ వగు నీపవిత్రచరిత్రము ముల్లోకములవారికిని జిరస్మరణీయుం బగుఁగాక!" అని యాశీర్వదించి యుశీనరుని సుందరశరీరము తొల్లిటికంటె నధిక తేజస్సౌందర్యములచే శోభిల్లునట్లనుగ్రహించి యానృపాలుని వీడ్కొని యంతర్హితులైరి.

---

అఖిలభూతదయాపరు♦లై సఘనులు
శ్రితుల శరణాగతుల రక్ష♦సేయువేళ
భాగ్యమైన, రాజ్యంబైనఁ♦ బ్రాణమైన
నర్పణము సేయుటకు వెను♦కంజ యిడరు.

---

# భస్మాసురుఁడు

పూర్వకాలంబున రాక్షసవంశమునందు భస్మాసురుం డను నొకదానవుఁడు జనించి సకలలోకకంటకుఁడై విజృంభించు చుండెను. క్రూరస్వభావముచే నాతనిమించినరక్కసు లెవ్వరు నదివఱకుఁ బుట్టి యుండలేదు. సాధువులను బాధించుటయే యాతనికి నిత్యకృత్యమై యుండెను. మూఁడులోకములయం దును దన కెదురెవ్వరును లేకుండవలయు ననియుఁ దనశత్రు వులందఱును సమూలముగ నశించిపోవలయు ననియు నాతని యుద్దేశము. దేవతలు, దానవులు, మానవులు మొదలగువా రందఱు నాతనిపేరుచెప్పిన గడగడలాడుచుండిరి.

ఇట్లున్నను దురాత్ముఁడగు నాదానవునకు సంతుష్టి గలుగలేదు. త్రిలోకములను గలఁగింపఁజేయునంతటి దివ్యశ క్తిని సంపాదింపవలయు నని యాతని కభిలాషగలిగెను. అందు చే నాతఁడు హిమాలయంబునకుం బోయి పరమేశ్వరు నుద్దే శించి యతిఘోరముగఁ దపంబు చేయనారంభించెను.

క్రమముగా నాతని తపస్తేజముచే సకలలోకములును బరితపింపఁదొడంగెను. లోకరక్షకుం డగుపరమేశ్వరుం డప్పుడు లోకావనంబునకై యాదానవేశ్వరునకుసాక్షాత్కరించి'వత్సా! నేను నీమహాతపంబునకు సంతుష్టుండ నైతిని. నీకేమి కావల

యునో కోరుకొనుము" అని యనుగ్రహించెను.

కంటకావరణముచేఁ గన్నులుగానక దారుణకృత్యముల నాచరించుచుండు దురాత్ములకు దేహబలమున్నంత బుద్ధిబల ముండదు. ఆభస్మాసురునకుఁ దన్నుఁ బ్రతిఘటించినవారిని నాశనము చేయునంతటి మహాబలమును సంపాదింపవలయు నని యుండెను. అందుకొఱకే యింతటి కఠోరతపము నొనరించెను; కాని యిప్పుడెట్టికోరికను గోరుకొనవలయునో యాతనికిఁ దోఁచుటలేదు.

అయ్యసురవీరుం డనేకవిధముల నాలోచించుకొనియెను. తనకెందు నపజయ మనుమాట లేకుండఁ బరుల నతిసులభముగా హింసించుటకుఁ దగినశక్తియే యాతనికిఁ గావలయును. తుదకాతఁ డొకవిధముగా నిశ్చయించుకొని పరమేశ్వరునకుఁ బ్రణామంబు చేసి "దేవదేవా! నాచేయి యెవ్వనితలపైఁ బెట్టుదునో యాతఁ డాక్షణమున నందే భస్మమైపోవునట్టి వరంబును నాకుఁ బ్రసాదింపవలయును" అని యర్థించెను.

భక్తవత్సలుం డగు దేవునకు భక్తులకోరికలను దీర్చుపట్టున వారిపాపపుణ్యస్వభావములతోఁ బనిలేదు. ఆదైత్యుని తపంబునకుఁ బరితుష్టుండైన యీశ్వరుం డప్పుడు "దానవాగ్రణీ! నీకోరిక సఫలం బగుఁగాక!" అని యానతిచ్చెను.

ఆమాట విన్నంతనే భస్మాసురుండు కోదమసింగము వలె లేచి తనదక్షిణహస్తమును పైకెత్తి యమ్మహాదేవునిశిరం

ముఖం బుంచుటకై విజృంభించి యొక్కయుదుటున నందీశ్వరుని మీఁదికి లంఘించెను. అది యంతయుం గాంచి వృషభరాజు మహాదేవునిమూఁపుపైఁ జేర్చుకొని చటాలున వెనుకకుఁ దిరిగి వాయుజవంబునఁ బరుగెత్త నారంభించెను.

అరక్కసుండును దనపూనికవిడువక "మహాదేవా! ఆఁగుమాఁగుము! నీవరప్రభావ మెట్టిదియో పరీక్షించుటకే వచ్చుచున్నాను. ఈభస్మాసురుని బారినుండి నీవెట్లును దప్పించుకొనఁజాలవు. నేఁటితో నీసర్వేశ్వరత్వము సమసిపోకతప్పదు. ఈత్రిభువనంబులయందును నాకంటెనధికు లెవ్వరు నుండఁగూడదనియే నేనింతకష్టపడి తపంబు చేసి తగినశక్తిని సంపాదించుకొంటిని. నీభస్మధారణముచేఁగాని యీభస్మాసురుని విజయరాజ్యము నిష్కంటకము గాఁజాలదు. నిలువుము! నిలువుము!" అని యదలించుచు నతివేగమున వృషభారూఢుఁడగు నీశ్వరుని వెంబడించి తఱుమ నారంభించెను.

నందీశ్వరుఁడు చొంగలు గ్రక్కుకొనుచుఁ దిరిగిచూడ కుండ నొక్కటేపరుగున దొరకినత్రోవను బట్టి పాఱిపోవుచుం డెను. మహాబలుం డగునావృషభేంద్రుని కాయాస మధిక మైపోయెను. భస్మాసురుఁడు విడువకుండఁ దగులుకొని వచ్చుచుండెను. అంతరిక్షమున దేవతలందఱు నాదారుణ సంఘటనముం గూర్చి హాహాకారములఁ గావించుచుండిరి. సకలలోకములును సంక్షుభితములై పోవుచుండెను. భక్తపరాధీనుం

దగుపరమేశ్వరుఁ డేమియుం దోఁచక నందీశ్వరునిమూఁపుపై స్థాణువుం బోలి కూర్చుండి యుండెను.

అప్పుడు జగత్పాలకుం డగువిష్ణుదేవుండు విప్రవేషధారియై భస్మాసురున కడ్డమువచ్చి “ అసురేశ్వరా! ఇదియేమి? నీవింత యాయాసముతోఁ బోవుటకు నిమిత్తమేమి? దేవతలెవ్వరైన నీకవిధేయులై వర్తించుచున్నారా? తపస్సు లెవ్వరైన నీయనుజ్ఞ లేకుండ యజ్ఞారంభముం గావించుచున్నారా? ఇంత యాయాసపడి వగర్చుకొనుచు నావేగముతో నీవెక్కడకుఁ బోవుచుంటివి?” అని ప్రశ్నించెను.

ఆరక్కసుం డించుక యాఁగి దీర్ఘశ్వాసములను విడుచుచు చేయెత్తి ముందువంకఁ జూపుచు “ అయ్యా! అవృషభవాహనుఁడు నాయెడలఁ బ్రసన్నుఁడై నాచేయి యెవ్వనితలపై నుంచిన వారు భస్మమైపోవునట్లు వరమిచ్చియున్నాఁడు. నేనిప్పు డాతనితలమీఁదనే నాహస్తమునుంచి వరప్రభావమును బరీక్షింప నెంచితిని. నాయుద్దేశము నెఱింగియు నాతఁడు భయపడి పాఱిపోవుచున్నాఁడు.” అని చెప్పెను.

విష్ణుదేవుండప్పుడు మందహాసముచేయుచు “ అసురేశ్వరా! ఇదియేనా నీయుద్దేశము? నిన్నుఁ దప్పించుకొని యమ్మహాదేవుఁ డెక్కడకుఁ బోఁగలఁడు. నీవంటివాఁ డింతయాయాసపడి యాతనిఁ దఱుమవలయునా? — కాని బ్రహ్మజ్ఞుండవగునీవు కొంచెమైన నాలోచించుకొనసక్కఱలేదా? వరమ

దయాళుండగునీశ్వరుం డెట్టియసాధ్యమైనకోరికనైనను భక్తుండవగునీకుఁ బ్రసాదించినఁ బ్రసాదించునుగాక—బ్రాహ్మణుండ వగునీవైనను శుచివై యాదివ్యశక్తిని బ్రసాదింపనక్కఱలేదా? నీవీలాగుననే పోయి యద్దేవునిశిరంబున నీహస్తము నుంచెదవనుకొనుము. అశుచివై యున్ననీమూలమున నాతఁ డెట్లు భస్మమై పోవుననుకొంటివి? అప్పుడు పరమేశ్వరునిమాటయే యసత్యమయ్యెనని నీకు సందేహముగలుగదా? నీయుద్దేశము దేవునిమాట యసత్యము చేయవలయునని కాదుగద! వరశక్తిని సాధింపవలయుననియే నీయుద్దేశమైనయెడల స్నానము చేసి శుచివై సంకల్పంబు చేసి కార్యారంభమునకుఁ గడంగుము! ఇంతలో నీశ్వరుఁ డెక్కడకుఁ బోఁగలఁడు" అని యుపదేశించెను.

మూఢుండగు భస్మాసురుండు యుక్తియుక్తంబులగు శ్రీహరివచనంబులకు సమ్మతించి స్నానార్థమై జలాన్వేషణంబు చేయం దొడంగెను. విష్ణుదేవుం డప్పుడు తనమాయచే నాసమీపంబున నొకసరోవరమును గల్పించెను. రక్కసుం డాపుష్కరిణిచెంతకుం బోయి జలంబులఁ బ్రవేశించి పూర్వాభిముఖుండై స్నానము చేయఁదలంచెను. కాని యెంతదూరము దిరిగినను సరస్సునందలి జలము మోఁకాలిలోఁతుకంటె నెక్కువగా లేకుండఁబోయెను.

ఆదైత్యుండు స్నానము చేయుట కవకాశములేక యహో

రక యాసరోవరమున లోఁతునీటికొఱకు వెదకికొనుచుండుటం గాంచి తీరమునందున్న నారాయణుం డుచ్చస్వరముతో "అసురేశ్వరా! అట్లు చూచెదవేమి? సరోవరమధ్యమునఁ గూర్చుండి నీళ్ళను జేతులతో నెత్తిపైఁ బోసికొనుము!" అని యుపాయము దెలిపెను. అవివేకి యగు నయ్యసురవీరుఁడు దూరాలోచన సేయక విష్ణుదేవుండు చెప్పినరీతిని దోసిళ్ళతో నీటిని దలపైఁ బోసికొనియెను. అప్పు డాతనిచేతు లాతనితలమీఁదనే పడుటచే లోకకంటకుఁడైన యాక్రూరరాక్షసుఁ డాక్షణమునందే భస్మమైపోయెను.

---

పుట్టలోనఁ బాలు ♦ పోయుచున్నను బాము
కస్సుమనుచు నెగసి ♦ కఱచునట్లు
కఠినచిత్తులైన ♦ ఖలులు కృతఘ్నులై
యుపకృతులకె గూర్తు ♦ రపకృతులను—

---

సకలజీవలోక ♦ సంక్షోభమును గూర్పఁ
దలఁచి త్రుళ్లుచుండు ♦ ఖలులు తుదకుఁ
దలనుమించుకష్ట ♦ ములఁ జేతులారంగఁ
దడవి తెచ్చుకొంద్రు ♦ తమకుఁ దామె.

---

# విద్యార్థి

అరుణి యను నొకవిప్రకుమారుఁడు విద్యానిధి యను గురునియొద్ద విద్యాభ్యాసము సేయుచుండెను. అతఁడు నిరంతరము నతిప్రియంబున గురుని సేవించుచు నాతనియనుగ్రహమునకుఁ బాత్రుఁడై మసలుకొనుచుండెను.

ఇట్లుండ గురుం డొకనాఁడు శిష్యునిం బిలిచి “వత్సా! మనపొలములోనినీరంతయుఁ బ్రక్కనున్న చేలలోఁ బడిపోవుచున్నది. వడుపు గలిగినచో మనముచాల నిబ్బందిపడవలసి వచ్చును. అప్పుడు దొరువులు త్రవ్వి నీరుతోడుకొనుటకంటె నిప్పుడే నీరు నిలువఁగట్టుకొనుట మంచిది గదా! కావున నీవు వేగముగఁ బోయి తూములను జాగ్రత్తగా బంధించిరమ్ము!” అని యాజ్ఞాపించెను.

గురునియాజ్ఞ యైనంతనే శిష్యుం డతిశీఘ్రముగఁ బొలమునకుఁ బోయి తెగిపోయిన చేనిగట్టును బంధించుట కారంభించెను. కాని వర్షావేగముచేఁ బైనుండి కొట్టుకొని వచ్చుచున్న వరదనీరు మిక్కుటముగాఁ బ్రవహించు చుండుటవలనఁ బడిపోయినగండిని బూడ్చుట యాతనికి సాధ్యము గాకపోయెను. అచ్చటిమట్టికూడ నంతయుపయోగముగ లేకుండుటచే నాతనిప్రయత్నము సాగుట లేదు.

కాని అరుణిమాత్రము తానారంభించినకార్యమును సాధారణముగా విడుచువాఁడు గాఁడు. వరద యెంతవేగముగాఁ బ్రవహించుచుండెనో యంతవేగముగా నాతఁడు మట్టి నెత్తి యాగండిలోఁబోయుచునే యుండెను. ఆతఁడట్లు ప్రాణపణముగా నెంతయాయాసపడి పనిచేసినను లాభము లేకపోయెను.

ఇఁక నాతని కుపాయాంతర మేమియును దోఁచినది గాదు. గురునికార్యముం దీర్పఁజాలకుంటినని యాతనికి మిగుల విచారము గలిగెను. తుద కాతఁడు మూఢునివలె సాహసించి తానే యాగండికడ్డముగఁ బోయి శయనించెను. అంతటితో జలప్రవాహ మాఁగిపోయెను. అరుణి యుద్విగ్నహృదయము గూడఁ బ్రశాంతం బయ్యెను.

సాయంకాల మైపోయినది. అరుణి యింకను నింటికి రాలేదు. గురుం డప్పుడు తత్తరముతో నితరశిష్యులం బిలిచి "అరుణి యెచ్చట నున్నాఁడు?" అని యడిగెను. పొలములోఁ బడియున్న యరుణిసంగతి యింటనున్నవిద్యార్థుల కెట్లు తెలియును? వారందఱు నప్పు డేకవాక్యముగా "గురుదేవా! నేఁటియుదయమునఁ బొలమునకుఁబోయి నీటిని జాగ్రత్తపఱచి రమ్మని యాజ్ఞాపించి మీరాతని బంపియున్నారు. అప్పటినుండియు మేమాతని జూడనేలేదు!" అని చెప్పిరి.

ఆమాట విన్నంతనే గురుండు వికలచిత్తుండై "ఏమిది!

ఆతఁ డింకను బాలమునుండి యింటికే రాలేదా ? అయ్యో ! పాప మాతని కెట్టికష్టముతటస్థించెనో గదా ! కుమారులారా! ఆతని వెదకి తీసికొనివత్తము రండు ! శీఘ్రముగా బయలుదేరుఁడు" అనిచెప్పి గురుం డాక్షణమునందే శిష్యసహితుండై సస్యక్షేత్రమునొద్దకుం బోయి "వత్సా ! అరుణీ ! ఎచ్చట నున్నావు ? శీఘ్రముగా రమ్మ !" అని కేకలు వైవఁదొడంగెను.

అప్పటికప్పుడే జలప్రవాహ మాఁగిపోయినది. పిమ్మట నరుణి యతిసులభముగా మట్టిపోసి యాగండిని బిగించివైచెను. ఇఁక శుభ్రముగా నొడలు గడిగికొనుటయే తరువాయిగా నుండెను. అంతలోనే గురునిపిలుపు వినంబడుటయు నాతఁడు న్నపాటుననే వచ్చి గురుదేవునకుఁ బ్రణామం బాచరించెను.

అంతగురుండు సంతోషముతో "వత్సా ! ఇంతసేపటివఱకు నిచ్చట నేమి చేయుచున్నావు. చీకటిపడకుండనిల్లు చేరుకొనవలదా ? నీకేమికష్టము గలిగెనో యని మేమందఱము నిన్ను వెదకుకొనుచు వచ్చితిమి. ఇంతసాహసము చేయుట తగునా ?" అనియెను.

అప్పు డరుణి వినయవినమితుండై జరగినవృత్తాంతమంతయు గురుదేవునకు యథారీతిగా విన్నవించెను. ఆమాటలాలకించి దయాళుం డగుగురుండు "వత్సా ! ఎంతపని చేసితివి ! గురుసేవాతత్పరుండవగునీవు ప్రాణపణంబుగ గురుకా

ర్యనిర్వహణంబు గావించుటయే విధాయకధర్మ మని భావించితివి. నీగురుభక్తికి సంతోషించితిని. నీకుశుభంబగుఁగాక ! ఈశ్వరానుగ్రహంబుచే నీవు సకలశాస్త్రంబులయందును బండితుండవై యద్వితీయప్రతిభాశాలి వయ్యెదవుగాక !" అని యాశీర్వదించెను.

---

తల్లిపిలుపుకంటెఁ ♦ దండ్రియానతికంటె
నరవరేణ్యుశాస♦నంబుకంటె
విద్యనభిలషించు ♦ విద్యార్థివరునకుఁ
గరముఁబ్రియము, ఘనము ♦ గురునియాజ్ఞ.

---

# అష్టావక్రుఁడు

ఉద్దాలకుఁ డనుమహర్షికి శ్వేతకేతుఁడను తనయుఁడును, సుజాత యనుతనయయుఁ గలిగిరి. ఆతని కేకపాదుఁ డను నొకశిష్యుఁడుండెను. ఆతఁడు మిగుల గురుభక్తుం డగుటచే నుద్దాలకుండు తనపుత్త్రిక యగుసుజాత నేకపాదున కిచ్చి కన్యాదానముతో పాటుగ నాతనికి సకలవిద్యాప్రదానముం గావించెను.

ఏకపాదుం డొకప్పుడు శిష్యులకు వేదపాఠము చెప్పుచుండఁగా గర్భవతి యగు నాతనిభార్యసుజాత యాసమీపమునం గూర్చుండి యాలకించుచుండెను. అప్పుడు సుజాతిగర్భమునందున్నశిశువు "నాయనా! మీరు రాత్రియంతయు నిద్రలేకుండ వేదము వల్లించుచున్నను నప్పుడప్పుడు మీకు స్వరభంగము గలుగుచునే యున్నదేమి?" అని కేకవైచెను.

ఆసమయమున శిష్యులందఱు నెదుటనే యుండుటవలన నేకపాదుండు లజ్జితుండై మాయర్భకునియెడలఁ గోపించి యవమానభరంబున దూరాలోచన సేయక "ఓరీ! నీవు కుమారుండవయ్యును దండ్రి నవమానించితివిగాపున నెనిమిదివంకరలు గలవికృతదేహముతోఁ బుట్టెదవుగాక!" అని శపించెను.

తండ్రిశాపముచే నట్లే జనించిన యక్కుమారున కష్టావక్రుం డను పేరుగలిగెను.

అష్టావక్రుఁడు పుట్టునప్పటి కాతనితండ్రి యగునేకపాదుఁడు సంసారమునందే యగపడకుండఁ బోయెను. ఆతఁడు మిగులదరిద్రుఁడై యింట సుజాత పడుచున్నకష్టములనుజూచి సహింపఁజాలక జనకమహారాజును సందర్శించి యేమైన సంపాదించి తేవలయు ననునుద్దేశముతో మిథిలానగరమునకుఁ బోయెను. కాని యారాజు చెంతనున్నపండితుఁడు తనతో వాదించి గెలిచినవారికిఁగాని రాజదర్శనము గానిచ్చుటలేదు. తన్ను గెలువఁజాలనివారు జలంబులఁ బడిపోవలయు నని పందెము వైచి యాతఁడు వచ్చినపండితు లందఱితోడను వాదించుచుండెను. తుద కెవ్వరు నాతని గెలువఁజాలక జలనిమగ్నులై పోవుచుండిరి. మన యేకపాదునకుఁగూడ నట్టిగతియే సంప్రాప్తమయ్యెను.

అష్టావక్రుఁడుపుట్టినప్పటినుండియుబుద్ధిమంతుఁడై మాతామహుఁడగు నుద్దాలకునియొద్ద సకలవిద్యల నశ్రమంబున నభ్యసించి యద్వితీయపండితుఁడై యుండెను. తండ్రివృత్తాంతమాతని కెవ్వరు నెన్నఁడును దెలిపియుండలేదు. ఉద్దాలకుఁడే తనతండ్రి యనియు, శ్వేతకేతుఁడే తనయన్న యనియు నాతఁడు భావించుకొనుచుండెను.

అష్టావక్రుఁడును, శ్వేతకేతుఁడు నించుమించుగా సమ

వయస్కు లగుటచే నయ్యిరువురును జోడుగూడి యాట లాడు
కొనుచు విహరించుచుండిరి. వారిరువురితో నప్పుడప్పుడు జగ
డములుగూడ జరుగకుండ లేదు.

ఈరీతిగాఁ బండ్రెండు వత్సరములు గడచెను. ఒకనాఁ
డష్టావక్రుఁడు తాతయగునుద్దాలకుని యొడిలోఁ గూర్చుండి
యుండుటను శ్వేతకేతుఁడు చూచి కోపముతోఁ బరుగుపరు
గునవచ్చి యాతనిచేయిపట్టుకొని తనతండ్రియుత్సంగమునుండి
యవ్వలికిఁ ద్రోచివైచెను. అందువలన నష్టావక్రుఁ డేడువ
నారంభించెను. శ్వేతకేతుఁ డంతమాత్రముచే నూరకుండక
«ఓరీ! ఇచ్చట నీవు గూర్చుండుట కిదియేమి నీబాబుతోఁడ
యనుకొంటివా?" అని ధిక్కరించెను.

ఆమాట యష్టావక్రునిచెవికి వాఁడిబాణమువలెఁ దాఁకు
టయు నక్కుమారుం డేడ్చుచుఁ దల్లియగుసుజాతచెంతకుఁ
బోయి «అమ్మా! నాతండ్రిగా రెచ్చట నున్నారు?" అని
యడిగెను.

ఇఁక సుజాత యెట్లూరకుండఁగలదు. ఆమె వెక్కివెక్కి
యేడ్చుచు నేకపాదునివృత్తాంతమంతయు నక్కుమారునకు
సవిస్తరముగాఁ దెలియఁజేసెను. ఆసంగతియంతయు నాలకించి
యష్టావక్రుఁ డేమియు ననలేదు. కాని యారాత్రిమాత్రము
శ్వేతకేతునితో నీవిషయముంగూర్చి చాలసేపు సంభాషిం
చెను.

బాలకులకోపము లాకస్మికములైనవి. అవి యెంత యోసేపు నిలువవు. కాని బాల్యస్నేహముమాత్రము సుస్థిరమైనది. వారాత్రి చాలసేపు మాటలాడుకొన్నతరువాత నష్టావక్రుఁడు శ్వేతకేతుం గాంచి "మనము రేపటిదినమున బయలుదేఱి మిథిలానగరమునకుఁ బోవుదము" అనియెను.

శ్వేతకేతుఁ డామాట విన్నంతనే యాశ్చర్యముతో "ఎందులకు? అచ్చట నేమి పనియున్నది?" అని ప్రశ్నించెను. అష్టావక్రుఁడు గంభీరస్వరముతో "అచ్చట జనకరాజు యజ్ఞము చేయుచున్నాఁడఁట! అచ్చటికి భూలోకమునందలి సకలమునులును, సకలపండితులును వచ్చెదరు. వారిప్రసంగముల నాలకించినచో నెంతయో మనోహరముగా నుండును. వారిని దర్శించుటకూడ నదృష్టము గాదా!" అనియెను.

శ్వేతకేతుఁ డుత్సాహముతో మిథిలానగరయాత్రకు సమ్మతించెను. మఱునాఁ డిరువురు నుద్దాలకునియొద్ద సెలవు గైకొని బయలుదేఱిరి. యజ్ఞవిషయముంగూర్చి సంభాషించుకొనుచుఁ బోవుచుండుటచే వారికి మార్గాయాస మెంతమాత్రము నగపడలేదు. అందుచే వారతిసులభముగా మిథిలానగరమును జేరఁగలిగిరి.

అప్పుడు మహారాజగు జనకుఁడు రాజమార్గమునుండి యజ్ఞశాలకుఁ బోవుచుండెను. వేత్రహస్తులు దూరమునుండి

కేకలు వైచుచు రాజునకు మార్గము నిరాతంకముగాఁ జేయు చుండిరి. వారు రాజవీథిని నడచుచున్న యష్టావక్రుని, శ్వేతకేతునిం గూడఁ దప్పుకొనుఁ డని కేకవైచిరి.

కాని యష్టావక్రుఁడుమాత్రము వారిమాటను వినిపించుకొనక మహారాజుసమీపమునకుఁ బోయి "రాజా! మార్గమధ్యమున ముందుగా గుడ్డివారికిని, దరువాతఁ జెవిటివారికిని, తరువాత నాఁడువారికిని, తరువాత బరువు మోచికొనుచుఁబోవువారికిని ద్రోవ వదలి కాని మహారాజు రాజవీథిని బ్రచారము చేయఁగూడదు. అందఱికంటెను ముందుగా సాధువు లగు బ్రాహ్మణులకు మార్గమును విడిచిపెట్టవలయును. ఇది రాజధర్మమై యుండఁగా నీపరిచారకులు సద్బ్రాహ్మణుల మగు మమ్ముఁ దప్పుకొనవలయు నని తొందరపెట్టుట యేమిన్యాయముగా నున్నది?" అని యడిగెను.

ఆమాట లుచితజ్ఞుఁడగు జనకభూపాలునకుఁ గోపమును గల్పింప లేదు. ఆతఁ డాశ్చర్యముతోడను, సంతోషముతోడను అష్టావక్రునిం గాంచి వేత్రహస్తులను వారించి "ఈతఁడు చెప్పినమాట సత్యమే. పిల్లవాఁడైనను బ్రాహ్మణకుమారుండు గావున మాననీయుఁ డగుచున్నాఁడు. శీఘ్రముగా నిక్కుమారులకుఁ ద్రోవ యొసంగుఁడు!" అని యాజ్ఞాపించెను.

అష్టావక్రుఁ డప్పుడు మరల గంభీరస్వరముతో "మహాప్రభూ! మేము చాల కష్టపడి నీయజ్ఞమును జూడవలయు నని

వచ్చియున్నాము. మీద్వారపాలకుఁడు మమ్ములను లోనికి రానిచ్చుట లేదు. అది మాకుఁ జాల నసంతుష్టిగా నున్నది. నీవు మాయందనుగ్రహించి మమ్ము లోనికి రానిచ్చునట్లు మీద్వారరక్షకుని కాజ్ఞాపింపవలయును " అని వేఁడుకొనియెను.

ద్వారపాలకుఁడు రాజు చెంతకు వచ్చి " స్వామీ ! ఇందు నాదోష మేమియును లేదు. మనసంస్థానపండితుని యానతిననుసరించి యట్లు చేయుచున్నాను. ఆయన పెద్దలగు పండితులనుమాత్రమే రానీయవలయు నని చెప్పియున్నారు. పిల్లవాండ్రను రానీయవలదనికూడ నిషేధించినారు" అని మనవిచేసెను.

అష్టా—ఓయీ ! పండితులనుమాత్రమే ప్రవేశపెట్టవలయు నని చెప్పినమాట యుక్తముగనే యున్నది. కాని మీసములును గడ్డములును నరసి దంతము లూడిపోయి మొగము ముడుతలపడినఁగాని యెవ్వరును బండితులు గాఁజాలరాయేమి ? కుఱ్ఱవాండ్ర మగుమేము పండితుల మగుదుమో కామో నీవెట్లు తెలిసికొనఁ గలవు ?

ద్వార—అయ్యా ! ముక్కుపచ్చలారనిమీరీచిన్నవయసులో నెంతచదువు చదువఁగలరు ? ఒక్కొక్కశాస్త్రము చదువుట కెన్ని యేండ్లుపట్టుననుకొన్నారు ? పిల్లవాఁడువచ్చి పెద్దమాటలు చెప్పినంతనే పండితుఁడై పోవునా ?

అష్టా—మంచిది. నీకుఁ దెలియకున్న మీమహారాజు

నైన నడిగి తెలిసికొనఁగూడదా ? నేఁడు మేము సభలోఁ బ్రవేశించి మీపండితునితో వాదించి యోడించినప్పుడు నీవు కన్నులారఁ గాంచి యెవ్వరెంతటిపండితులో తెలిసికొనఁగలవు.

ద్వార—బాలకులగుమీరు పండితు లనినాకెట్లు తెలియును ? మీసంగతి నేను తెలిసికొనునంతవఱకైనను మీరు వేచి యుండవలయును. అట్లు గాకున్నచో మీయాధిక్యమును జూపుటకైనను మీరు ప్రయత్నింపవలయును. ఊరక తొందరపడిన నేమిలాభము ?

అనుటయు నష్టావక్రుండు మహారాజుం గాంచి ‟ప్రభూ! మీపండితుఁడు చాలగొప్పవాఁడని వినియుంటిని. అతఁడు చాలమందిపండితుల నోడించి సరోవరమునఁ బడఁద్రోయుచున్నాఁడు. విద్యాధికులలో నంతటినిర్దయుఁ డుండునని నే నెన్నఁడును వినియుండలేదు. నేనాతని నొకసారి దర్శింపవలయునని యనుకొనుచున్నాను. ఈదినమున నేనాతని నోడించి తటాకమున మునిఁగింతునో లేదో మీరే స్వయముగాఁ జూచెదరుగాక !” అనియెను.

రాజు—విప్రకుమారా ! నీవా పండితశేఖరునివిశేషమును బాగుగ గ్రహింపలేదు. నీకంటెను బెద్దపెద్ద లెందఱో వచ్చి యాతనికి లొంగిపోయియున్నారు. అతనితో సమానముగ వాదించినవారుగూడ నిదివఱ కెవ్వరు నగపడలేదు.

అష్టా—స్వామీ! మీమాటలనుబట్టిచూడఁగా నాపం

డితుఁ డిదివఱకెన్నఁడు మావంటివారిచేతులలోఁ బడలేదని స్పష్టముగా బోధయగుచున్నది. అందుచేతనే యాతనికంతగర్వము. ఒకసారి యాతఁడు నాతో వాదమునకుఁ గడంగినచోఁ బ్రవాహమునఁ దిరుగఁబడిపోయిన శకటమువలెఁ జెదరిపోకమానఁడు.

ఆమాటలనుబట్టి మహారాజీబ్రాహ్మణబాలకుఁడు సాధారణుఁడు గాఁడని తలంచి యాతని ననేకవిధములఁ బరీక్షింప నారంభించెను. అష్టావక్రుఁడు తడవుకొనకుండఁ బ్రత్యుత్తరము లిచ్చుటయు రాజు సంతోషించి "అయ్యా! నీవు చిన్నవాఁడవైనను బ్రతిభావంతునివలె నగపడుచున్నావు. నీవు లోనికివచ్చుట కాంతరమేమియునులేదు. ఇదిగో! మాపండితుఁడీయజ్ఞశాల ముఖద్వారమునందే యున్నాఁడు. ఆతనితోఁ గలసి మాటాడుము!" అని చెప్పి తాను సపరివారముగా లోపలఁ బ్రవేశించెను.

అష్టావక్రుఁడును శ్వేతకేతునితోఁ గలసి లోనికిఁబోయి యాస్థానపండితునింగాంచి "అయ్యా! మేము నీతో వాదింప వచ్చితిమి. నేనడిగినదానికి నీవుత్తరము చెప్పినను సరియే—కాక నీవు నన్నుఁ బ్రశ్నించినను సరియే—నీయిష్టము వచ్చినతీరునఁ జేయుము. ఈవాదమం దెవ్వరోడిపోయెదరో వారు పుష్కరిణిలోఁ బడిపోవలయును!" అనియెను.

తోడనే యష్టావక్రుఁడును, బండితుఁడును గలసి సభా

రంగమునఁ బ్రవేశించి వాదింప నారంభించిరి. అప్పు డాస్థాన పండితుఁడు ముందుగా నేకసంఖ్య నందుకొని "అరుణు లెన్ని యైనను, నగ్ని యొక్కఁడే—వెలుఁగు లెన్నియైనను సూర్యుఁ డొక్కఁడే—రోగము లెన్నియైనను మృత్యువొక్కటే—సొమ్ములెన్నియైనను సువర్ణ మొక్కటే—కుండ లెన్నియైనను మట్టి యొక్కటే—" అని వరుసపెట్టి వచింపనారభించెను.

అష్టావక్రుండును నాతనికంటె ద్విగుణీకృతవేగముతో జంటసఖ్యను విషయముగాఁ జేసికొని "ఇంద్రాగ్ను లిద్దఱైనను మిత్రులు—పర్వతనారదు లిద్దఱైనను దేవర్షులు—అశ్వినీకుమారు లిద్దఱైనను దేవవైద్యులు—భార్యాభర్త లిద్దఱైనను బ్రథానగృహస్థులు—రథచక్రములు రెండైనను సమానములు—" అని యనేకరీతులఁ బలుకుదొంతరలను దడఁబడకుండఁ దరలింపఁదొడంగెను.

ఈవిధముగా నొకరినిమించి యొకరు వాక్కలహమును సాఁగించుచుండిరి. అష్టావక్రుఁడు పండితుఁడెత్తుకొన్న ప్రతిసంఖ్యకును పై సంఖ్య నెత్తుకొని ప్రసంగించుచుండెను. తుట్టతుదకష్టావక్రుఁడు పండ్రెండవసంఖ్య నందికొని "సంవత్సరమునకుఁ బండ్రెండు మాసములు—జగతీచ్ఛందమునఁ జరణమునకుఁ బండ్రెండక్షరములు—ప్రళయకాలమునకుఁ బన్నిద్దఱు సూర్యులు—శాలప్రియము పండ్రెండేండ్లు—ఇఁక మనప్రభువువారి యజ్ఞము ముగియుకాలము పండ్రెండు దినము

లు—" అని యింకను జెప్పసాగెను.

ఆపైని పండితుఁడు పదుమూఁడవసంఖ్య నందుకొని “గణితశాస్త్రసంజ్ఞను విశ్వములు పదుమూఁడు.” అనిచెప్పి యనంతరస్ఫురణ లేకుండుటచేఁ దలత్రిప్పుచు నాలుక గొఱికికొనుచు వెఱ్ఱిమొగమునైచి దిక్కులఁ దిలకింపఁదొడంగెను. తరువాత నష్టావక్రుఁడు నవ్వుచు “ఇంకేమున్నది? నాకుఁ బదుమూఁడవయేఁడు—నీవు నాకంటెఁ బదుమూఁడురెట్లు పెద్దవు!” అని పరిహాసముగావించెను.

అది యంతయును గాంచి సభాసదులందఱును జప్పట్లు చఱచుచు నానందకోలాహలము గావింపఁ నారంభించిరి. ఆపండితుఁ డనిన నందఱకును భయమే యగుటచే నెల్లవారు నాతని నసహ్యించుకొనుచుండిరి. ఒక చిన్నపిల్లవానిచేతిలో నాతఁ డిట్లు డొకనిమిషములో విజితుఁడై పోవుట యందఱకును సంతోషముగా నుండెను.

అప్పు డష్టావక్రుఁడు సభవంకఁ జూచి “అయ్యా! ఈనిర్దయుఁ డగుబ్రాహ్మణపండితుఁడు చాలమందివిద్యార్థికులగు భూసురోత్తములను గంగాప్రవేశము చేయించినాఁడు. ఈబ్రహ్మహంతకుని నిప్పుడూరక విడుచువాఁడను గాను. నేనీతనితోఁ బందెమాడి గెలిచితిని. కావున నీతఁడు మొదట నన్నుకొన్నప్రకారము జలప్రవేశము గావింపవలయును. కావున

నిప్పుడే యీతనికాలుసేతులను బంధించి యీసరోవరమున ద్రోసివేయవలయును" అనియెను.

ఇట్లు నిశ్చయముగా నష్టావక్రుఁడు చెప్పుచున్నను బందితుఁడుమాత్ర మించుకంతయైనను భయపడుట లేదు. సరిగదా, యీతఁడు పరమానందముతోనే "సభ్యులారా! జలమధ్యమునం ద్రోసివైచినంతమాత్రమున నాకేమియు నపాయము లేదు. నేను వరుణపుత్రుఁడను. ఈజనకమహారాజువలెనే నాతండ్రిగూడ ద్వాదశవర్ష పరిమితం బగు నొకయజ్ఞము నారంభించినాఁడు. ఆయజ్ఞకార్యములను దీర్చుటకై పండితులగు ననేకబ్రాహ్మణులు కావలసి యుండెను. అందుచే నేనీవిధముగా యుక్తిచేసి మహాపండితులనందఱును సరోవరమునఁ బ్రవేశింపఁజేసి మాజనకునిచెంతకుఁ బంపుచున్నాను. వారందఱును గూడ మాతండ్రిచెంత నిప్పటివఱకును సుఖముగనే యున్నాను. ఆతనియజ్ఞముగూడఁ బూర్తిగావచ్చినది. త్వరలోనే వారు భూరిదక్షిణల నందికొని భూలోకమునకు వచ్చి తమతమ నిలయంబులకుఁ బోయి సుఖింపఁగలరు" అని చెప్పెను.

కాని యాపండితునివాక్యముల నచ్చటివా రెవ్వరును విశ్వసింపఁజాలకపోయిరి. అప్పుడందఱును మహారాజుం గాంచి యేకవాక్యముగా "ఇంతపని చేసిన కపటచిత్తుఁడగునీపండితు నిప్పు డేమిచేయవలయును?" అని ప్రశ్నించిరి.

రాజు — ఈపండితుఁడిప్పుడు సభాసదులయెదుట నీబ్రాహ్మణకుమారునితో వాదించి యోడిపోయెను. కావున మొట్ట

మొదటఁ గావించుకొన్న ప్రతిజ్ఞ ననుసరించి యీతఁడు తప్ప కుండ జలనిమగ్నుఁడు గావలయును.

అష్టా—ఔను. అన్నమాట జరగింపవలయును. వరుణుఁడు జలాధిపతియే గదా! ఈతఁడు నిజముగా వరుణపుత్రుఁడే యైనచో జలంబులఁ బడినంతమాత్రమున నీతని కెట్టి యాపదయును గలుగనే కలుగదు!

పండి—విప్రకుమారా! బుద్ధిమంతుఁడ వగు నీవు నిజము చెప్పితివి. ఇందువలన నాకిప్పు డెట్టి భయంబును లేదు. నే నెంతమాత్రము నసత్యము చెప్పుట లేదు. నీవిప్పుడే నీజనకుండగు నేకపాదమహర్షిని జూడఁగలవు.

అని చెప్పుచునే యాపండితుఁ డదివఱకు జలనిమగ్నులం గావించి వరుణలోకమునకుం బంపినపండితుల నందఱను బయటికిఁ దీసికొని వచ్చెను. అప్పు డేకపాదుఁడు జరిగినవృత్తాంత మంతయుం దెలిసికొని పరమానందముతో మహారాజుం గాంచి "ప్రభూ! ఇందుకొఱకే లోకమునందు గృహస్థులు పుత్రలాభమును వాంఛించుచుందురు. రాజేంద్రా! చిరకాలము గురుకులవాసముచేసి యెంతటివిద్యావంతుఁడనైనను నేను చేయఁజాలని ఘనకార్యమును నాకుమారుఁ డనాయాసముగా నిర్వహింపఁగలిగెను. కావున నేను ధన్యుఁడనైతిని. స్వామీ! నీకు శుభమగుఁగాక!" అనియెను.

ఏకపాదుం డిట్లు చెప్పి ముగించినంతనే పండితుఁడు వినీతస్వరముతో "భూపాలచూడామణీ! నేను చిరకాలమునుండి

నిన్నాశ్రయించి యుండి సుఖముగాఁ గాలక్షేపము చేసితిని. అనుజ్ఞ యొసంగినచో నిఁక నేను నాజనకుని చెంతకుఁ బోయెదను. నీచే నతిగౌరవముగ నాదరింపఁబడుచున్న నేను నీయెడలం గావించినలోపములను మన్నింపవలయును." అని వేఁడుకొని యమ్మహారాజు ననేకవిధముల నాశీర్వదించి వెడలిపోయెను.

అష్టావక్రుం డప్పుడు తనతండ్రిని సమీపించి పరమానందముతోఁ బ్రణామం బాచరించి యాతనిపాదధూళిని శిరంబున నిడుకొని తక్కిన బ్రాహ్మణు లందఱిచేతను శుభాశీర్వాదంబులను, మహారాజుచే నమూల్య బహుమానంబులను, ధన్యవాదంబులను బడసి పితృమాతులసహితుండై యత్యుత్సాహముతో నిజగృహంబునకుం బోయి తల్లికిని దాతకును వందనంబులు గావించి యెల్లసంగతులను వారి కెఱింగించి యానందపులకితు లగువారిచే నాశీర్వాదములం గాంచెను.

అనంతరము మహాతపస్సంపన్నుం డగు నేకపాదుఁడు తన్నుమించి కులంబునకు వన్నె దెచ్చినతనయుని యష్టావక్రిత్వమును దొలఁగించి దేవకుమారునివలె సౌందర్యరాశిగాఁ జేసి యనుగ్రహించెను.



అంద మెల్లున్న నేమి గు♦ణాలిచేతఁ,
తేజుచే, బుద్ధిచేత, స♦ద్విద్యచేత,
మహిమచే వన్నె కెక్కుకు ♦ మారుచేతఁ
బితృకులంబంత కగుఁగాదె ♦ పేరువాసి!

# బుద్ధిబలము



ఒకప్పుడైశ్వర్యగర్వితుం డగురావణుండు కైలాసపర్వతంబున మహాదేవారాధనంబు గావించి శంకరుండు ప్రసన్నుండుగాకుండుటచే హిమాలయంబునకు దక్షిణభాగంబున నున్న వృక్షఖండకం బను స్థానంబునకుం బోయి యచ్చట భూతలంబునం దొకకుండమును ద్రవ్వి యందగ్నిస్థాపనంబు గావించి యాసమీపంబున శివలింగమును నిలిపి వివిధరీతుల హోమంబు గావింప నారంభించెను.

అప్పటికిని శివుండు సాక్షాత్కరింపకుండుటచే నిజమస్తకచ్ఛేదనముం గావించి హోమంబు చేయందొడంగెను. ఈవిధంబుగ నారాక్షసేంద్రుండు తొమ్మిదిశిరంబులను హోమంబుగావించెను. ఇంక నాతని కొక్కశిరంబుమాత్రమే మిగిలియుండెను. అదియు నాతండు హోమంబు సేయ నుద్యుక్తుండగుటయు శంకరుండు సాక్షాత్కరించి “రాక్షసరాజా! నేను నీయారాధనంబునకు మెచ్చితిని. వరంబు గోరుకొ”మ్మనియెను.

అప్పుడు రావణుండు “మహాత్మా! నీకు నాయెడలం గరుణ గలదేని నాకసమాన బలప్రదానంబు గావింపుము.

మఱియునో దేవదేవా ! నాశిరంబు లెప్పటివలె నుండు నట్లను గ్రహింపు"మని ప్రార్థించెను. భక్తవత్సలుం డగు సదాశివుం డాతని కతులబలంబును బ్రసాదించి యాతనిమస్తకంబుల నెప్పటివలె నుండున ట్లనుగ్రహించెను.

రావణుం డీవిధంబుగ నభీష్టసిద్ధిం గాంచి స్వస్థానంబు నకుం బోయెను. అంత దేవతలును మహర్షులును గ్రూరుం డగురావణునకు భగవత్సాహాయ్యంబు లభియించినందులకు మిగుల విచారించుచు నారదునింగాంచి "ఓ దేవర్షి శేఖరా ! నీవు దేవగణంబులకొఱ కెట్టియసాధ్యకార్యంబునైనను దీర్ప టకు సమర్థుండవు. ఇప్పుడు రావణుండు బలగర్వితుండై యున్నాఁడు. ఆదుష్టుండు మమ్ములను బీడించినచో మేమేమి చేయుదుము ? ఇందులకుఁ బ్రతివిధానం బనుగ్రహింపవల యును." అని వేఁడుకొనిరి.

అంత నారదుం "ఓ సాధువులారా ! మీరు విచారిం పకుఁడు. నేనొకయుపాయంబు నాలోచించెద" నని చెప్పి వీణ వాయించుకొనుచు రావణుండు పోవుచున్న మార్గము ననుస రించి యాతని వెంబడించి పోవందొడంగెను. అట్లు పోవుచు నారదుండు మార్గమధ్యంబున రావణునిం గాంచి దేవకార్య నిర్వహణ తత్పరుండై యిట్లనియెను.

ఓ రాక్షసేంద్రా ! నీవు ధన్యుండవు. నిన్నుం గాంచు

టచే నాకిప్పు డనిర్వచనీయంబగు నానందము కలుగుచున్నది. నీవిప్పు డెక్కడకు బోవుచున్నాఁడవు? ఇంతటి సంతోషముతో నింతవేగముగఁ బోవుటకుఁ గారణమేమి? నీయుద్దేశ మేమియో తెలిసికొనవలయు నని నాకతికుతూహలముగ నున్నది.” అని యడుగుటయు రావణుం డిట్లనియెను.

“ఋషిశ్రేష్ఠా! నేను దేవదేవుండగు శంకరు ననేకరీతుల నతికష్టంబున నారాధించి ప్రసన్నునిం గావించుకొని యాదేవుని యనుగ్రహంబున నసమాన బలంబును గాంచి పరమానందముతో నామందిరంబునకుఁ బోవుచున్నాఁడను.” అనియెను.

నారదుండు వికటహాసంబు చేయుచు “రాక్షసరాజా! నేను నీహితంబుకొఱకుఁ జెప్పుచున్నాను వినుము. నీవు కష్టపడి తపంబుచేసి శివునిం బ్రసన్నుఁ గావించుకొని యభీష్టసిద్ధిం గాంచితి నని సంతోషించుచున్నావు. నీవు ప్రార్థించినంతనే నీకోరిక నొసంగిన శివునిమాట సత్యం బనిమాత్రము నీవు విశ్వసింపవలదు. ఏమనిన నాశివుండు కేవల మున్మత్తుండగు వాఁడేమి చెప్పినను జెప్పఁగలఁడు. నీవు నాకుఁ బ్రియుండవు. నామాటయందు విశ్వాసంబుంచుము. ఆశివుండు నీకట్టి యసమాన బలం బొసంగె నందులకుఁ దార్కాణముగ నీవిప్పుడే పోయి కైలాస పర్వతమును నీ కరంబులకుఁ బ్రయత్నించి

మోసము. అట్లు నీవు చేయం గలిగితివా నీయెడలఁ బ్రసన్నుండై శివుండు ప్రసాదించిన వరంబు సార్థకం బయ్యెనని విశ్వసింపవచ్చును. పిమ్మట నెప్పటివలె నాపర్వతమును యథాస్థానమునం దుంచి సుఖంబుగ నీవింటికిఁ బోవచ్చును. నీకు నామాటయందు విశ్వాసం బున్నచో నిట్లు చేయుము." అని నారదుండు ప్రబోధించెను.

బలదర్పితుండగు రావణుండు నారదునివచనంబులు హితంబులును, సత్యంబులు నని విశ్వసించి తక్షణంబ కైలాసంబునకుం బోయి బలవంతముగ నప్పర్వతంబును పైకెత్తుటయు నందలియావద్వస్తువులును నొకదానిపై నొకటి పడిపోవుచుండెను. అది యంతయుఁ గాంచి శివుండిదియేమని యాశ్చర్యావిష్టుం డగుటయు నప్పుడు పార్వతీదేవి మందహాసము చేయుచు "నాథా! దీనికిఁ గారణము మీరే. మీశిష్యునకు మీరొసంగిన బలప్రభావముచే నింత పుట్టినది. మంచిశిష్యు నేసంపాదించితిరి" అని పరిహాసించెను.

అంత శివుండు సర్వంబును గ్రహించి బలదర్పితుండగు రావణుని యెడలం గోపించి యోరీ! నీబాహుగర్వనిర్వాపణ కారణుం డగుపురుషుండు శీఘ్రకాలంబుననే యవతరింపఁ గలఁడని శాపంబొసంగెను. ఆశాపవచనములను నారదుం డాకర్ణించెను. బలవిమోహితుం డగురావణుం డప్పుడాత్మ

బలంబు విశ్వాససంపన్నం బగుటయుఁ గైలాసపర్వతము నెప్పటివలె నున్నచోటనే నిలిపి వచ్చినత్రోవనే వెడలిపోయెను. అంతేకాని తనకంత్యకాలము సమీపించెనను సంగతి నాతఁ డెంతమాత్రమును గ్రహింపఁజాలకయే పోయెను.

---

బాహుబలగర్వితు లధర్మ♦పరులు క్రూర
చిత్తులగు దైత్యు లెంత యు♦దేయులైన
శాంతులుఁ, దపఃప్రభావుల♦సాధుజనుల
బుద్ధిబలమున విజితులై♦పోవుచుంద్రు.

---

# వామనావతారము



పూర్వకాలంబున దేవతలకుఁ బరమశత్రుండై బలినామంబుచే నొకమహాదైత్యుండు చక్రవర్తియై యుండెను. ఆతనికెందును బరాజయంబు లేదు. ఆతనిమహోన్నతిం గాంచి దేవతలు చింతితులై యందఱు నేకీభవించి యాతని నెట్లయిన జయింపవలయు నని మంత్రాలోచనంబులు సేయ నారంభించిరి.

ఆబలిదైత్యునిరాజ్యపాలనసమయంబునఁ ద్రైలోక్యంబును నిష్కంటకమై యుండెను. ఆతనిపరిపాలనంబునం దాధివ్యాధులుగాని, శత్రుభయంబులుగాని, ఈతిబాధలుగాని, అధర్మములుగాని, అభావములుగాని, ఆర్తనాదములుగాని, దుర్జనోపద్రవములుగాని యెవ్వరికిని స్వప్నంబులందైనను లేక యుండెను.

అప్పుడు దేవత లాతనిమహోన్నతి యనుశరంబుచే భగ్నచిత్తులై యెందును శాంతియనుమాటలేక పరితపించుచు భయవిహ్వలులై మాత్సర్యవశంబున విష్ణుదేవుని శరణంబు గోరి వచ్చి ప్రార్థనాపూర్వకంబు లగుదీనస్వరములతో ,,దేవదేవా! శంఖచక్రగదాధరా! ఆర్తులమును గతసత్త్వులము నగుమమ్ముఁ గటాక్షింపుము. జనార్దనా! నీవు మారక్షణంబు కొఱకే యాయుధధారి వైతివి. జగన్నాథా! నీవంటిరక్షకుని

ప్రాపు గాంచియుండియు మేమిట్టికష్టముల ననుభవింపవలసి వచ్చినది. దేవా! నీపరిణామస్తవంబులకు వినియోగింపఁదగిన మావాక్కుల నిప్పు డాదైత్యుని నమస్కారస్తవంబులకై యెట్లుపయోగింపఁగలుగుదుము? మీచరణకమలంబుల నాశ్రయించి యున్నమే మాదనుజున కెట్లు నమస్కరింపఁగలము? అచ్యుతా! మేమనేకయజ్ఞంబులయందు నిన్నే యర్చించుచు నుదారవచనంబులతో నిన్నే కీర్తించుచుందుము. నీవంటి దేవదేవునియాశ్రితుల మగుమే మాతని నెట్లాశ్రయింతుము? ఇంద్రప్రముఖు లగుదేవత లందఱును నీబలమే రక్షణంబుగా నీచే నున్నతపదాభిషిక్తులై యున్నారు. అట్టివారొక్కదైత్యునకుఁ లోఁబడియుండుట యవమానకరము గాదా? మేము నీకు భిన్నుం డగుదైత్యునకు నమస్కరించుట యెట్లు? దేవా! ఈజగంబునం దైశ్వర్యమే ప్రధానమైనది. అది లేకున్నచో లాభ మేమున్నది? మేమిప్పు డాతని కెట్లు నమస్కరింపఁగలము? ఆదిమధ్యాంతరహితుండవును, జరాదిరహితుండవునగు నీవుండఁగా వినశ్వరుండును, శత్రుండు నగుదైత్యునకు మేము నమస్కరించుటయా? దేవా! మేమందఱమును నీయైశ్వర్యబలంబుచేఁ బరిపుష్టులమై యెప్పటికైనఁ ద్రిభువనవిజయంబు గావించి సాపేక్ష్యలాభంబు నందుదుముగాని యీదైత్యునకు వినతులమై యుండఁగలమా?" అని ప్రార్థించిరి.

ఇట్లనేకవిధంబుల దేవతలు ప్రార్థించుటయు గదాధ

రుండు కరుణాళుండై « సురవరులారా ! దైత్యేశ్వరుం డగు
బలి మద్భక్తుండు. అతఁడు సురాసురగణంబుల కవధ్యుఁడు.
ఆబలీంద్రుండు నాచే నెల్లు పాలింపఁదగినవాఁడో యట్లే మీ
రును బరిపోషింపఁదగినవారై యున్నారు. నేనెట్టియుద్ధమును
గావింపకుండఁగనే యుక్త్యుపాయంబున నాతనిరాజ్యంబును
గైకొని బంధించి మీరాజ్యమును మీకొసంగెదను. ” అని
యనుగ్రహించుటయు దేవతలు పరమానందహృదయములతో
సమ్మహాదేవునికడ సెలవుగైకొని నిజనివాసంబులకుం బోయిరి.

ఆనంతరము భగవానుం డగుదేవేశ్వరుం డదితిగర్భం
బునఁ బ్రవేశించి యజ్ఞేశ్వరుండును, యజ్ఞపురుషుండు నగునా
తఁడు వామనుండై యవతరించెను. దేవతలందఱును మహో
త్సవములఁ గావించుచు నుత్సాహముతో భావిఫలోదయం
బున కెదురు సూచుచుండిరి. అంతఁ గొంతకాలమునకు బలి
శ్రేష్ఠుం డగుబలి యశ్వమేధదీక్షితుం డయ్యెను.

అనేకులగు మహర్షులు యజ్ఞార్థమై వచ్చియుండిరి. వేద
వేదాంగవేది యగుశుక్రాచార్యుండు పురోహితుం డయ్యెను.
ఆతఁడు ఋత్విక్కర్మనిరతుం డైనంతనే హవిర్భాగహారణార్థమై
దేవగంధర్వాదు లేతెంచిరి. ఈవిధముగా సకలయజ్ఞక్రియ
లును సంపూర్ణప్రాయము లగుచున్నసమయంబునఁ జిత్రకుం
డలమండితుం డగువామనమూర్తి సామగానంబు సేయుచు
యజ్ఞశాలం బ్రవేశించి యయ్యజ్ఞంబును గూర్చి యనేకవిధ

ములఁ బ్రశంసించెను.

అప్పుడు భృగునందనుం డగుశుక్రాచార్యుండు దైత్య నిషూదనుండును, బ్రహ్మరూపధరుండునగువామనమూర్తిం గాంచి యాతఁడే సకలయజ్ఞంబులకును, దపంబులకును ఫల దాత యనియు, రాక్షసకులంబునకు నిహంత యనియు స్పష్ట ముగా గ్రహించెను.

తోడనే యాతఁడు సంభ్రమముతో విజయుండును, బలిశ్రేష్ఠుండును, దానశీలుండును, సత్త్రీసుండును, యజ్ఞదీక్షి తుండు నగుబలిచక్రవర్తిం గాంచి "రాజా! వామనాకృతి యగునివ్విప్రుండు నీయజ్ఞశాలం బ్రవేశించి యున్నాఁడు. ఈతఁడు నిజముగా బ్రాహ్మణుండు గాఁడు. యజ్ఞవాహనుం డును, యజ్ఞేశ్వరుండు నగువాసుదేవుఁడే దేవహితార్థమై యదితిగర్భంబున శిశురూపంబున నుదయించి యీవిధముగా నిప్పుడు నిన్ను యాచించుటకై వచ్చియున్నాఁడు. కావున నోప్రభూ! వాతో నాలోచింపకుండ నీవీతని కెట్టిదానంబును గావింపవ లదు." అని బోధించెను.

అరిందముం డగుబలిచక్రవర్తి యాచార్యునివచనంబు లాకర్ణించి "గురువరా! యజ్ఞేశ్వరుఁడే యీరీతిగా నవతరించి మద్గృహంబునఁ బ్రవేశించుటచే నేను ధన్యుండ నైతిని. ఆతఁ డేమివాంఛించునో దానినొసంగుట కింకను నాలోచన లేల?" అని చెప్పి సతీసహితుండై వామనమూర్తి కూర్చుండియున్న

శాపునకుం బోయి ప్రణామంబు చేసి చేతులు జోడించుకొని నిలిచి ‹‹ మహాత్మా! నీకేమి కావలయునో యర్థింపు ” మని కోరుటయు వామనుండు పదత్రయపరిమితం బగుభూదానము కంటె నాకన్యవాంఛితం బేదియును లేదని చెప్పెను. బలిచక్రవర్తియుఁ దక్షిణమే మణికలశంబునందలిజలంబులచే ధారాపూర్వకంబుగ నవ్వామనదేవునకు మూఁడడుగులభూమిని దానము చేసెను.

సమస్తమహర్షిగణంబులును, స్వయముగఁ బురోహితుండగుశుక్రాచార్యుండును, ప్రధానులగుదైత్యగణంబులును జూచుచుండఁగనే వామనమూర్తి కావిధముగా భూదానము గావింపఁబడియెను. అప్పుడు వామనమూర్తి మృదుమధురస్వరంబుతో స్వస్తివచనంబుల నుచ్చరించుచు ‹‹ రాజా! నీవు సుఖవయ్యేదవుగాక! నాభూమిని నాకు సంప్రదానంబు సేయుము. నేను పోవలయు ” ననియెను.

బలీంద్రుం డట్లే యని చెప్పి యాతనివంకఁ దిలకించుచు నిలువఁబడియెను. అట్లు చూచుచుండఁగనే వామనుండు విశ్వరూపధారణముం గావించి చంద్రసూర్యులను, గగనంబును మించునంతటిదూరంబుగాఁ బెరిఁగి నిలిచెను. యజ్ఞపురుషుండును, అచ్యుతుండు నగునాతనివిక్రమాకృతి కంతంబు లేకుండెను.

అప్పుడు దైత్యేంద్రుండగు బలి పత్నీసహితుండై యమ్మ

హాదేవునకుఁ బ్రణామంబు చేసి వినయమధురభాషణంబులతో «శ్రీహరీ! జగన్నాథా! విష్ణుదేవా ! నీవు నీశక్త్యనుసారంబుగా నీయిచ్ఛవచ్చినంతదూరమువఱకును నీపదంబులచే నాక్రమింపుము. దేవా! ఆకారణంబుచే నేనుగూడ నెల్లవిధంబుల మహోన్నతపదలాభంబు నందఁగలుగుదును.” అని ప్రార్థించెను.

మహాక్రతుమూర్తి యగువిష్ణుమూర్తి యట్లే యని చెప్పి కూర్మంబువఱకును గలయధోలోకంబు లన్నియు నేకపాదంబుచేతను, బ్రహ్మలోకపర్యంతముం గలయూర్ధ్వలోకము లన్నియు నేకపాదంబుచేతను నాక్రమించి «అసురేశ్వరా! నాతృతీయపాదంబు నుంచుటకు స్థానం బెచ్చట నున్నది? ఈసమస్తప్రపంచమును నారెండడుగులకొలతకు సరిపోయినది. నీవన్నయట్లుగా మూఁడవయడుగునకుఁ దగినతావు నొసంగు” మని యడిగెను.

అంత బలిదానవేంద్రుండు మందహాసంబు సేయుచు «దేవాదిదేవా! నేను సృష్టికర్తను గానుగదా! ఈవిశ్వం బంతయును నీచేతనే కల్పింపంబడినది. జగన్మయా! నీదోషంబుచేతనే యిది యంతయు నల్పంబై పోయినది. ఇట్టిచో నేనేమి చేయుదును? కేశవా! అయినను నేనెన్నఁటికి నసత్యమాడు వాఁడను గాను. కావున నీమూఁడవపదంబును నాశిరమునం

డుంచి నన్ను సత్యప్రతిజ్ఞునిగా ననుగ్రహింపుము" అని ప్రార్థించెను.

వేదమూర్తి యగుభగవానుండు ప్రసన్నుండై "దైత్యరాజా! నీనిర్మలభక్తిభావంబునకు నేను ప్రీతుండనైతిని. నీయభీష్టవరప్రదానంబు గావించెద నర్థింపు" మని యనుగ్రహించెను.

కాని బలిచక్రవర్తి యెట్టివరంబును గోరుకొనఁడయ్యెను. అప్పుడు జగన్నాథుండును, త్రివిక్రముండు నగువిష్ణుదేవుండు సంతోషించి యమ్మహాదానశీలుండగు నసురేశ్వరునకు రసాతలాధిపత్యంబును, ఆత్మాధిపత్యంబును భావికాలంబున నింద్రపదంబును, శాశ్వతం బగుమహాయశంబును బ్రసాదించి సస్త్రీకుం డగుబలిదానవేంద్రుని రసాతలరాజ్యసింహాసనంబునఁ బ్రతిష్ఠించి యథాపూర్వంబుగా స్వర్గరాజ్యమును దేవేంద్రునకుఁ గరగతంబు గావించెను.

---

బ్రిదుక వచ్చుఁగాక ♦ బహుబంధనము లైన
వచ్చుఁగాక లేమి ♦ వచ్చుఁ గాక
జీవధనము లైనఁ ♦ జెడుఁగాక పడుఁగాక
మాటఁదిరుగ లేరు ♦ మానధనులు.